1585
1585 TPLA12013156
SREE DURGA MODERN BOOK DEPOT BEZWADA

# శరత్ కథలు

హరిలక్ష్మి, చిత్రకారుడు, విలాసి, హరిచరణ్

( మూడవభాగం )

శరత్ బాబు

అనువాదం:
శివరామకృష్ణ

దేశికవితామండలి
ఘంటశాల & బెజవాడ

I

జై శ్రీ ప్రచురణ
ప్రథమ ముద్రణం '45

రూపాయి
300 ప్రతులు

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

,, శివరామకృష్ణ

సరస్వతీ ప్రెస్,
బెజవాడ

# హరిలక్ష్మి

ఈ కథ ప్రారంభమైంది అత్యల్ప విషయంలో నైనా దానివల్ల హరిలక్ష్మి జీవితంలో కలిగిన మార్పు మాత్రం చిన్నదీకాదు, తుచ్ఛమూ కాదు. లోకంలో తరచు ఇలాంటివి జరుగుతూనే వుంటాయి. బేల్‌పూర్‌లో ఇద్దరు జమీందారీ భాగస్వాములు శాంతనదివద్దున్న ఓడ చెంతను చిన్ననావలాగ ఒకరినొకరు ఆశ్రయించుకొని నిరుపద్రవంగా వుంటున్నారు. హఠాత్తుగా తుపానొకటి ఎక్కడినుంచి వచ్చిపడిందో ఏమో, ఓడతాడు తెగింది, లంగరు విరిగి వేరైంది, నిమిషంలో చిన్న నావ ఎక్కడ అంతర్ధానమైందో ఎవరికీ అంతు లేదు.

బేల్‌పూర్ తాలూకా పెద్దదేమీ కాదు. కూర్చుని లేవలేని రైతుల దగ్గర ఎంత పిండివసూలు చేసినా సాలుకు పది పన్నెండు వేలకన్న ఎక్కువ వసూలు కాదు. కాబట్టి పది హేనణాల భాగస్థుడు శివచరణునిముందు రెండుకానుల భాగస్థుడు విపినుని ఓడ చెంత చిన్ననావతో పోల్చినా అతిశయోక్తేమీ వుండ దనుకుంటాను.

దూరపు బంధువులైనప్పటికీ ఇద్దరూ ఒకజ్ఞాతి సోదరులే. ఆ రెండుతరాలకు పూర్వం ఇద్దరూ ఒకతండ్రి బిడ్డలే. కాని ఇవాళ ఒకరికి మూడంతస్తుల మేడ వూరంతటికీ తలమానికంగా విరాజమానమై వుంది. రెండవవారి జీర్ణ కుటీరం రోజు రోజుకీ భూమిమీదకు వరగబోతూవుంది.

అయినా ఆవిధంగానే కాలం గడుస్తూవుంది. తక్కిన కాలంకూడా విపినుడు ఆవిధంగానే సుఖదుఃఖాలలో మెదల కుండా గడిపేవాడు. కాని కారుమబ్బులవల్ల ఆకాశంలో చెల రేగినతుఫాను అంతా తారుమారు చేసింది. అది ఈవిధంగా వుంది.

పదిహేనసాలన్నర భాగస్థుడు శివచరణుని భార్య అగ స్మాత్తుగా చనిపోయేటప్పటికి, అతని స్నేహితులు నలుగురూ 'నలభై ఏళ్ళైతే ఒకవయసా. మళ్ళా వివాహం చేసుకో' అన్నారు. పగవారు విని నవ్వసాగారు. 'నలభై ఏళ్లేమిటి, మరో నలభైవుంటేగా' యని. అసలు సంగతేమిటంటే, ఈ రెంటిలో ఏదీ నిజంకాదు. ఏది ఎలావున్నా పెదబాబుగారిది కాయ లాంటి శరీరం. నెత్తిమీద వెంట్రుకలుమాత్రం కొద్దిగా వూడి పోయాయి. వయసులో గడ్డాలు మీసాలు రాకపోవటంవల్ల కొంచెం సానుకూలంగావున్నట్లు తోచింది. మరికొన్ని ఇబ్బం దులుకూడా వచ్చిపడ్డాయి. ఏదఏలావున్నా ముఖ్యంగా ధన వంతుల పెళ్ళిళ్ళు ఏదేశంలోనుకూడా వయసుపట్టింపువల్ల ఆగ లేదు. ఇంకా బెంగాలులో ఎందుకుఆగుతుంది! ఆ తర్వాత శివచరణుడు హరిలక్ష్మిని పెండ్లాడి తన యింటికి తీసితెచ్చు కున్నాడు. పగవారు ఎలా అనుకున్నా ప్రజాపతి (వివాహ దేవత) నిజంగా అతనియందు చాల దయతో వున్నాడన్న సంగతి ఒప్పుకోవలసివస్తుంది. వరునితో పోల్చితే వధువు వయసు అంతగా వ్యత్యాసం కనపడదు ఇద్దరుముగ్గురు పిల్లలను వెంటబడేసుక వచ్చినా అనవచ్చేముంది! కాని ఆమె అందగత్తెని మాత్రం అందరూ అంగీకరిస్తారు. సాధారణంగా పెండ్లికి వచ్చిన పిల్లలకన్న ఆమె వయసు కొంచెం ఎక్కువగా

వుంటుంది. పంధోమ్మిదేళ్ళకు తక్కువవుండదు. ఆమెతండ్రి ఆధునిక భావాలుగల సాంస్కారి. ఎంతో ప్రయత్నంతో కుమార్తెను ఇంతవయసు వచ్చేవరకు చదువుచెప్పించి మెట్రిక్ ప్యాసు చేయించాడు. ఆయన ఉద్దేశం మరొకటైనా ఆకస్మికంగా వ్యాపారంలో దివాలాతీసి, పరిస్థితులు తారుమారై, దారిద్ర్యం ఆవహించేప్పటికి ఇలాంటి పాత్రకు కూతుర్ని అంటగట్టవలసివచ్చింది.

లక్ష్మి పట్టణపుపిల్ల. రెండుమూడురోజులలోనే భర్త నర్థంచేసుకుంది. బంధుబాంధవులు, దాసదాసీలతో నిండివున్న ఈపెద్దకుటుంబంలో మనసిచ్చి ఆమె ఎవరితోనూ కలిసిపోలేక పోయింది. ఒకవైపున శివనాగయ్యని ప్రేమకూడా అంతు లేదు. కేవలం వృద్ధునికి పడుచుభార్య అనుకుంటున్నారే కాదు. అతనికి ఒక్కసారి ఒక అమూల్యనిధి దొరికినట్లనిపించింది. ఇంట్లోవారు, నౌకరూ- చాకర్లూ ఆమెస్వభావాన్ని ఎలా అర్థం చేసుకోవాలో నిశ్చయించలేక పోయారు. ఇక చిన్నమ్మగారిని చూచేటప్పటికి ఆమె మొహం గంపైంది. రూపములో, గుణములో, విద్యాబుద్ధులలో ప్రతివిషయంలోనూ ఆమెకు శృంగభంగం కలిగింది.

ఇంత చేసినప్పటికీఏమీలాభం లేదు. రెండునెలలలోపలే లక్ష్మిజబ్బు పడింది. ఈజబ్బుస్థితిలో వుండగానే చిన్నమ్మగారు ఆమెనొక రోజున చూట్టానికి వచ్చింది. చిన్నమ్మగారంటే విపినుని భార్యని వుద్దేశం. పెద్దింటి కొత్తకోడలు జబ్బుపడిందని విని చూట్టానికి వచ్చింది. వయసులో ఆమెరెండుమూడేళ్లు పెద్దగా వుంటుందీ, అందమైనదీ అన్నసంగతి లక్ష్మికూడ లోలోన ఒప్పుకున్నది. ఈవయసులోకూడా ఆమెవంటిమీద పేదరికపు

చిహ్నాలు స్పష్టంగా కనపడుతున్నాయి. వెంటఆరేడేళ్ల పల్లెటి కుర్రవాడున్నాడు. లక్ష్మిఅదరంతో ఆమెకు తనమంచంమీద ఒకపక్కను కూర్చోటానికి చోటిచ్చి కొంచెంసేపు ధ్యానంతో ఆమెవంక చూస్తూ వూరుకుంది: చేతులకు రెండుజతలగాజులు తప్పవంటిమీద ఇంకే నగలూలేవు. మాసిన ఎర్రించుపంచె కట్టుకొంది. బహుశా అది ఆమెభర్తదై వుంటుంది. కుర్రవాడు దిగంబరంగా లేకగ్రామఆచారాన్ననుసరించి మొలమీద ఏదో ఒకచిన్న పచ్చంచు పంచె కట్టుకున్నాడు.

లక్ష్మిమెల్లగా చిన్నతోడికోడలు చేతిని దగ్గరకులాక్కుని "నా అదృష్టకొద్దీ ఈజ్వరం వచ్చింది. కాబట్టే మిమ్మల్ని చూడగలిగాను వరుసకు నేను పెద్దతోడికోడలినౌతాను. మరిది వీరికన్నచాల చిన్నవారట" అన్నది.

"వరుసకు చిన్నైతే 'మీరు' అనిఅనవచ్చునా?" అడిగింది చిన్నతోడికోడలు.

"మొగటిరోజని ఏదోఅన్నాను. లేకపోతే 'మీరు' అనేదాన్నికాదు. కాని నువ్వుకూడనన్ను 'అక్కా'అనకపోతే వూరుకోను తెలుసా! నాపేరు లక్ష్మి" అన్నది లక్ష్మి.

"పేరు చెప్పవలసిన అవసరం లేదుఅక్కా! మిమ్మల్ని చూస్తేనే తెలుస్తుంది. మీపేరు......నాపేరు వెగతాళిగా కమలని ఎవరు పెట్టారో తెలియదు" అని ఆమె నవ్వింది.

హరిలక్ష్మికి ప్రతివాదంగా నిన్నుచూస్తేకూడా నీపేరు తెలుస్తూవుందని అనాలనుకుంది. కాని అనుకరణ అనిపిస్తుందేమోనని భయంలో అనలేక పోయింది. "మనిద్దరమూ ఒకవిధమైన వాళ్ళము. కాని నేనునిన్ను 'నువ్వు' అనగలిగాను కాని నువ్వుమాత్రం అనలేదు" అన్నది.

చిన్నకోడలు నవ్వుతూ "చవ్వన నోటివెంటరాదుఅక్కా! ఒక్కవయసులోనే కాకుండా అన్నివిషయాలలోనూ మీరు నాకంటె పెద్దవారు. ఇంకారెండుమూడురోజులు పోనీ అంతగా అవసరమైతే మార్చుకోటం ఎంతసేపు పడుతుంది?" అన్నది.

హారిలక్ష్మినోటివెంట దీనిప్రతిసమాధానం చప్పున రాలేదు. కాని ఈస్త్రీ మొదటినాటి పరిచయం పెంచదలచు కోలేదని గ్రహించింది. ఆమె ఏమీ అనక పూర్వమే చిన్న కోడలు లేచినుంచుని "ఇకవెళ్ళొస్తాను అక్కా! మళ్లారేపు ..." అన్నది

హారిలక్ష్మి మరింత ఆశ్చర్యచకితురాలై "ఇప్పుడప్పుడే ఎలా వెళతావు! కొంచెం కూర్చో" అన్నది.

"మీరు అనుమతిస్తే కూర్చోక తప్పదు. ఇవ్వాళకి వెళ్లనీయి అక్కా, వారు వచ్చే వేళయింది" అని ఆమె కొడుకు చేయిపట్టుకొని వెళ్లబోయేముందు నవ్వుతూ "వెళ్తాను అక్కా! రేపు కొంచెం పెందలాడే వస్తాను" అనిఆమెమెల్లగా బైటికి వెళ్లిపోయింది.

విపినునిభార్య వెళ్ళిపోయినతర్వాతకూడా హారిలక్ష్మి చాల సేపటివరకు అటువైపే చూస్తూవుండిపోయింది. ఇప్పుడు జ్వరం లేదుగాని వ్యధమాత్రం అలాగే వుండిపోయింది. అయినా కొంచెంసేపు ఆమె అంతా మర్చిపోయింది. ఇంతవరకు ఈ వూళ్ళోకి ఎంతోమంది కోడళ్లు వచ్చారు. కాని వారెవరినీ ఈ పెదకోడలితో సరిపోల్చడానికీ వీలులేదు. వారు తమంతట తామే వచ్చేవారు. చెప్పకుండానే గంటలకొద్దీ కూర్చునేవారు. ఇంకా కూర్చోమనిఅంటే వేరేచెప్పాలా? వారిలో

ఎంత ప్రగల్భత, ఎంత వాచాలత్వం. వినోదానికి ఎంత చక్కని ప్రయత్నం! భారంతో కృంగిపోతున్న ఆమె మనసు మధ్య మధ్య విశ్రాంతికి ప్రోత్సాహకం చేసే. అకస్మాత్తుగా వచ్చి ఆమెతోగ కళ్యాణద్ద కొద్దినిముషాలు పరిచయం చేసి పోయిన ఈమె ఎవరు? ఆమె కన్నవారింటి సంగతులు అడగటానికి అవకాశం లేకపోయింది. తనలాగ ఆమె కలకత్తా పిల్ల ఎప్పటికీ కాదని లక్ష్మి అడగకుండానే గ్రహించింది. పల్లెటూరిపడుచు అయినప్పటికీ విపినునిభార్య చదువుకున్నది. అదే ఆమె ఘనత. శ్లోకాలు కంఠంతో 'రామాయణ, మహాభారతాలు' చదివించుకోవటంకన్న ఇంకా కావలసిందేమనుకుంది లక్ష్మి. తనలాంటి నిరుపేద చేతిలో తనకూతుర్ని పెట్టిన తండ్రి-ఇంటిదగ్గర మాష్టర్ని పెట్టి స్కూల్లో చదివించి-ఎఫ్.ఏ. పాసుచేయించి కన్యాదానం చేసి వుండడు. ఉజ్జ్వలశ్యామవర్ణం-అది ఎరుపు అనటానికివీలు లేదు. సరే రూపంసంగతి అలా వుంచు. విద్య, వయసు, స్థితి ఏ విషయంలోనూ కూడా విపినుని భార్య తనముందు నిలువ లేదు. కాని ఒక్క విషయంలో మాత్రం లక్ష్మి తనను ఆమె కంటె తక్కువగా భావించింది. ఆమె కంఠస్వరం! సంగీతం లాగ వుంటుంది. ఆమె మాటలువింటూ వుంటే అమృతం ఒలికిస్తున్నట్లువుంటాయి. ఎటువంటి సహజ సరళ సంభాషణ! కాని అన్నిటికన్న ఆమెను బాధించివేసింది - ఆమె ఔదార్యం. ఆమె పేదింటి కోడలని నోటితో చెప్పకపోయినా అదే ఆమె స్వాభావికమన్నట్లుగా, అదిలేకుండా మనిషి శోభించదనిపిస్తుంది. పేదదేశాని యాచకురాలు కాదు. ఒక పెద్దింటి కోడలు జబ్బుగావుంటే చూడటానికివచ్చింది. ఇంతకుతప్ప

ఇంకేవుద్దేశమూ ఆమెలో లేశమాత్రంకూడా లేదు. సాయంత్రం-పతి మాట్లాడానికి వచ్చినప్పుడు హారిలక్ష్మి - ఇంకేదేదో మాట్లాడిన తర్వాత "ఇవ్వాళ వారింటికోడలు వచ్చింది" అన్నది.

"ఎవరు? పిసినారి భార్యా?" అన్నాడు శివచరణుడు.

"అవును. నా అదృష్టం ఇవ్వాళ్ళకు స్వయంగా నన్ను చూట్టానికివచ్చింది. కాని పది నిముషాలకన్న ఎక్కువ కూర్చో లేదు. పనుందని వెళ్ళిపోయింది" అన్నది హారిలక్ష్మి.

"అవును? వాళ్ళింటిదగ్గర నౌకరు - చాకర్లెవరుంటారు! బట్టలు ఉతకటం దగ్గర్నుంచి ఎసరుపెట్టటంవరకు పనులన్నీ ఆమె చేతిమీదుగానే చేసుకోవాలి. నీలాగ విశ్రాంతిగా ఎవరుకూర్చుంటారు! ఒక్క గ్లాసెడు మంచినీళ్ళుకూడా నీచేత్తో ముంచుకుతాగే అవసరం వుండదు" అన్నాడు శివచరణుడు.

తన్నుగురించిన అలాంటి మంతవ్యం హారిలక్ష్మికి చాల చెడ్డగాతోచింది. కాని ఈమాటన్నది తన గొప్పతనం చూపెట్టటానికేగాని అవమానపర్చటానికి కాదని తెలుసుకొని ఆమె కోపగించుకోలేదు. "చిన్నతోడికోడలు చాల గర్వపోతనివిన్నాను. తన ఇల్లువదిలిపెట్టి ఎక్కడికీ వెళ్ళనే వెళ్ళదట?" అన్నది.

"ఎలా వెళుతుంది? చేతులకు రెండు మట్టిగాజులుతప్ప ఇంకేమైనా వుంటెగా-సిగ్గులేకుండా బైటకొచ్చి తలెత్తి తిరగటానికి?" అన్నాడు శివచరణుడు.

హారిలక్ష్మి కొంచెంనవ్వి "దానికి సిగ్గుదేనికి? లోకులు ఆమె వంటిమీద బంగారపు తొడుగులు చూట్టానికి వ్యాకుల పడుతున్నారా ఏమిటి; లేకపోతే-ఛీ-ఛీ అనటానికి?"అన్నది.

"బంగారపు తొడుగులా? నేను నీకు యిచ్చినన్ని నగలు ఏగాడిదకొడుకైనా కళ్ళతో చూచాడా? పెళ్ళానికి ఇవ్వాళవరకు రెండు గాజులుతప్ప ఇంకేం చేయించిపెట్టలేక పోయాడు! డబ్బు పరిభావము మహా గొప్పపరిభావం! చెప్పు తీసుకకొడతాను......" అన్నాడు శివచరణుడు.

హరిలక్ష్మి సిగ్గుపడి "చీ! చీ, అలాంటిమాటలంటా రెందుకు?" అన్నది.

"లేదు, లేదు, నావద్ద చాటుమాటలేమీలేవు. అనే దేమిటో బహిరంగంగానే అంటాను" అన్నాడు శివచరణుడు.

హరిలక్ష్మి మెదలకుండా కళ్ళుమూసుకు పండుకుంది. మాట్లాట్టానికిమాత్రం ఏముంది? ||బలహీనులను కఠినంగా, కర్కశంగా మాట్లాడటమే బహిరంగంగా మాట్లాడట మంటారు వీరు.|| శివచరణుడు శాంతించి వూరుకోలేక పోయాడు. "పెండ్లికి అయిదువందలరూపాయిలు అప్పుతీసు కున్నాడు. ఇప్పుడు దానికి వడ్డీ అసలుఫాయిదాలుకలసి ఏడు వందలరూపాయలైంది— ఏమయినా జ్ఞాపకముందా? లేనివాడు. ఒకమూలపడివున్నాడు, పడివుండని. నేను తలుచు కుంటే చెవుపట్టుకునిబైటికి ఈడ్చుకురాగలను. దాసీదానికంటే కనాకష్టం, నాభార్యముందుగర్వం, ప్రదర్శించవచ్చిందా..." అనసాగాడు.

హరిలక్ష్మి వత్తిగిలి పండుకొని నిద్రపోయింది. జ్వరం దాని మీదట విరక్తి, లజ్జ, మూలంగా శరీర మంతటా కంప నం ప్రారంభమైంది.

మర్నాడు రెండుఝాములకు ఇంట్లో మృదుస్వరంవిని హారిలక్ష్మి కన్నెత్తి చూచేటప్పటికి విపినుని భార్య మెదలకుండా బైటికి వెళుతూవుంది ఆమెను పిలచి "వెళుతున్నావా?" అన్నది.

చిన్నకోడలు సిగ్గుపడుతూ తిరిగివచ్చి "మీరు నిద్రపోతున్నారను కున్నాను. ఇవ్వాళ వంట్లో ఎలావుంది అక్కా" అన్నది.

"ఇవ్వాళ చాలకులాసాగావుంది. ఎక్కడ, మీఅబ్బాయిని తీసుకురాలేదేం?" అన్నది హారిలక్ష్మి.

"ఇవ్వాళ వేళగానివేళ నిద్రపోయాడు అక్కా?" అన్నది చిన్నకోడలు.

"వేళగానివేళ నిద్రపోయాడంటే?"

"మంచిదికాదని వాణ్ణినేను పగటిపూట నిద్రపోనివ్వను"

"అల్లరిచెయ్యడు?"

"ఎందుకు చెయ్యడు? పగటిపూట నిద్రపోయేకన్న అదేమంచిది" అన్నది చిన్నతోడికోడలు.

"నువ్వుకూడా నిద్రపోవా?"

చిన్నకోడలు నవ్వుతూ "లేదు" అన్నది.

స్త్రీ స్వభావాన్ననుసరించి ఈసారి బహుశా ఆమె తన కష్టసుఖాలన్నీ చెప్పుకుంటుం దనుకుంది హారిలక్ష్మి. కాని ఆమె అలాంటిమాట లేమీ తీసుకురాలేదు. ఆతర్వాత సంభాషణ ప్రారంభమైంది. మాటల సందర్భంలో హారిలక్ష్మి తన కన్నవారింటి సంగతులూ, అక్కచెల్లెళ్ల విషయాలూ, మాష్టరుగారి

కబుర్లు, స్కూలు వివరాలు చివరికి తను మెట్రిక్ పాసయిన సంగతికూడా చెప్పింది. కొంచెంసేపటికి ఆమెకు తెలివి వచ్చిన తర్వాత, తోడికోడలు శ్రోతగా ఎంత మంచిదైనా వక్తగా ఏమీకాదని స్పష్టంగా ఆమె గ్రహించింది. తనసంగతులు ఆమె ఒక్కటికూడా చెప్పలేదు. మొదట లక్ష్మికి సిగ్గేసింది కబుర్లు చెప్పతగింది ఆమెవద్ద ఏముంది అనుకున్నది మళ్లా. నిన్న ఆమె మనసు చిన్నతోడికోడలి యందు ఎంత సంతృప్తిగావుందో, ఇవ్వాళ అంత తృప్తిగా వున్నట్టుతోచింది.

గోడనున్న కిమ్మతుగడియారం చిత్రవిచిత్రాలైన మోతలతో మూడు కొట్టింది. చిన్నతోడికోడలు లేచినుంచుని "ఇక వెళ్తాను అక్కా!" అన్నది.

లక్ష్మికుతూహలంతో, "నీకుమూడుగంటల వరకే నా ఏమిటి తీరిక దొరికేదీ? మరిది గడియారం చూచుకొని లైంకిమరీ ఇంటికి వస్తాడా ఏమిటి?" అన్నది.

"వారు ఇవ్వాళ ఇంటివద్దే వున్నారు అక్కా" అన్నది చిన్నతోడి కోడలు.

"అయితే ఇవ్వాళ తొందర దేనికి? ఇంకొంచెంసేపు కూర్చోరాదు?"

చిన్నతోడికోడలు కూర్చోనూ లేకపోయింది; వెళ్లటానికి ముందుకు అడుగువెయ్యలేక పోయింది. "మీరెంతో విద్యనభ్యసించారు. ఎంతోచదివారు నేను పల్లెటూరి దానిని అక్కా" అన్నది మెల్లగా.

"మీ కన్నవారిది పల్లెటూరా ఏమిటి?"

"అవును అక్కా పట్టిపల్లెటూరు. తెలియక నిన్నఏమి చెబుతూ ఏమి చెప్పానో- అగౌరవ పర్చటానికికాదు. మీరు నన్ను ఎంత వట్టువేయమన్నా సరే."

హారిలక్ష్మి స్థంభించి పోయింది.

"అలా అంటావేం చెల్లీ!' నువ్వు అలాంటిమాటలు ఏమీ చెప్పలేదు" అన్నది.

చిన్నకోడలు దీనికి సమాధానంగా ఇంకేం అనలేదు కాని వెళతాను, అని మళ్లా శెలవు తీసుకొని మెల్లగా బైలు దేరబోయేప్పుడు అకస్మాత్తుగా ఆమెకంఠ సర్వం మరోవిధంగా వినిపించింది.

రాత్రికి శివచరణుడు ఇంటికి వచ్చినప్పుడు హారిలక్ష్మి మెదలకుండా పండుకొని వుంది. శరీరం స్వస్థతగా, మనసు ప్రశాంతంగా, ప్రసన్నంగా వుంది.

"వంట్లో ఎలాగుంది లక్ష్మి!" అడిగాడు శివచరణుడు

లక్ష్మిలేచి కూర్చుని "బాగానే వుంది" అన్నది.

"పొద్దుటి సంగతి విన్నావా? చిన్నవాణ్ణి పిలచిఅందరి ముందూ - దులిపివదలి పెట్టాను - జీవిత పర్యంతం మరచిపో కుండా. నేను బేల్‌పూర్ శివచరణ చౌదరిననుకో ఆ!" అన్నాడు శివచరణుడు.

హారిలక్ష్మి భయపడింది. "ఎవర్ని?" అన్నది.

"విపినుణ్ణి పిలచి - నీపెళ్ళాం నాభార్యదగ్గరకు వచ్చి మహాగర్వం చూపిస్తూ ఆవిణ్ణి అవమాన పరుస్తుందట - ఇంత ధైర్యమా దానికి! హద్దువిడచింది - చిల్లరముండ! దానిబుద్ర

గొరిగించి తలకు సున్నం పూసిగాడిదనెక్కించి వూరుబైటకు పంపిస్తా, తెలుసా? అన్నాను—" అన్నాడు శివచరణుడు.

హరిలక్ష్మి రోగ మొహం ఒక్కసారి తెల్లబడిపోయింది "నువ్వనేది ఏమిటి?" అన్నది.

శివచరణుడు రొమ్ము విరుచుకొని సగర్వంగా "ఈవూళ్లో జడ్జయినా, మేజిస్ట్రేటయినా, ఇనస్పెక్టరయినా, పోలీసయినా-ఈతడేననుకో. ఈతడే? చంపేకాష్టమూ, బతికించే కర్రా రెండూ నా గుప్పిట్లోవున్నాయి. నువ్వు కోరుకుంటే-రేపీ పాటికి విపినుడి పెళ్ళాంను రప్పించి నీపాదాలు వత్తించకపోతే-నేను లాట్ చౌదరికి పుట్టలేదనుకో. నేను......" అన్నాడు.

ఈవిధంగా విపినుని భార్యను అందరి ఎదటా చేసిన అవమానాన్ని వర్ణిస్తూ, వ్యాఖ్యానిస్తూ లాట్ చౌదరిగారి పుత్రుడు మాట్లాడిన భాషలో అపశబ్దాలకేమీ కొదువలేదు. అతని ముందు నిస్తబ్ద నిర్నిమేష దృష్టితో చూస్తూ హరిలక్ష్మి మనసులో "బద్దలైపో భూమీ‌ంతా!" అనుకొనసాగింది.



౨

రెండోపెళ్ళి పడుచుభార్య శరీరరక్షణకోసం శివచరణుడు ఒక్కతన దేహాన్ని మినహా సర్వస్వం ఇవ్వగలడు. హరిలక్ష్మిది శరీరం బేల్‌పూర్‌లో బాగుపడలేదు. గాలిమార్చాలని డాక్టర్లు సలహాచెప్పిపోయారు. శివచరణుడు తన పదిహేనణాలన్నర హోదాప్రకారం పెద్ద అట్టహాసంతో గాలిమా

ర్పుకు వెళ్ళటానికి ఏర్పాట్లుచేస్తున్నాడు. ప్రయాణసుముహూర్తంరోజున వూరంతా పరుగులెత్తుకవచ్చారు. కాని విపినుడు అతని భార్యామాత్రం రాలేదు. బైట శివచరణుడు అనరాని మాటలన్నీ అంటున్నాడు. లోపల పెత్తల్లి వుగ్రరూపంధరించింది. బైట మాటలోమాట కలిపేవారికేమీ తక్కువలేదు. అలాగే లోపలకూడా పెత్తల్లి వుగ్రరూపానికి దోహదమిచ్చే స్త్రీలుగూడా చాలమంది పోగయ్యారు. ఒక్కహారిలక్ష్మి మాత్రం ఏమీ మాట్లాడలేదు. చిన్నతోడికోడలి యందు ఆమెకున్న క్షోభా, అభిమానం ఎవరికంటేనూ తక్కువకాదు. నా పతి ఎంత అన్యాయంచేసినా నేను స్వయంగా ఏమీ అనలేదుగా! అనిమనసులో అనుకోసాగింది. కాని ఇన్నాళ్ళ ఇంట్లోనూ బైటవాగే స్త్రీల మాటలో మాట కలపటానికి ఆమెకు హేయంగాతోచింది. వెళ్ళేటప్పుడు మేనాతలుపుతీసి లక్ష్మి వుత్సుకదృష్టితో విపినుని పడిపోయిన ఇంటికిటికీకేసిచూచింది. కాని ఎవరి ఛాయకూడా కనిపించలేదు.

కాశీలో ఇల్లుకుదిర్చారు. అక్కడి శీతోష్ణస్థితులగుణం వల్ల లక్ష్మి మళ్ళా కోలుకోటానికి ఎక్కువకాలం పట్టలేదు. నాలుగునెలల తర్వాత ఆమె తిరిగి ఇంటికి వచ్చినప్పుడు-ఆమె వంటిఛాయ చూచి స్త్రీలుచాటుమాటుగా ఈర్ష్య పడకుండా వుండలేక పోయారు.

హేమంతఋతువు వస్తూన్నది. రెండుఝాములకు, చిన్న కోడలు కూర్చుని పతికి వున్ని మేజోళ్ళు అల్లుతూవుంది. చెంతనే కూర్చునికొడుకు ఆడుకుంటున్నాడు, వాడుచూచి "పెద్దమ్మ" అని బిగ్గరగా అరిచాడు.

తల్లి చేతిలో పని ఎక్కడి దక్కడ వదలిపెట్టి చప్పున లేచి నమస్కరించి కూర్చోడానికి పీట వేసింది. తర్వాత వికసిత వదనముతో "ఆరోగ్యం బాగుపడిందా అక్కా!" అన్నది.

"ఆఁ బాగుపడింది! బాగుపడకపోతే తిరిగిరాగలిగే దాన్నే కాదు. అయినా వెళ్లేటప్పుడు నువ్వొకాస్త తిరిగి కూడా చూడక పోయావు. వెళ్లేప్పుడు మేనాలోంచి మీ ఇంటి కిటికీ కేసి చూస్తూ పోయాను. మొహం కూడా చూపించలేదు. అక్క రోగంతో వెళుతూవుంటే నీ మనసు కాస్తకూడా కరగ లేదా చెల్లీ! నువ్వు అంతరాయి వైపోయావేం?" అన్నది లక్ష్మి.

చిన్నతోడికోడలు కళ్లల్లో జలజల నీళ్లు నిండుకొచ్చాయి. కాని నోటివెంట ఒక్క మాట కూడా రాలేదు.

"నాలో ఎన్ని దోషాలున్నా నా మనసు నీయందు కఠి నంగా మాత్రం లేదు. అలాంటి సమయంలో నేను నిన్ను చూడకుండా వుండలేను" అన్నది లక్ష్మి.

చిన్నతోడికోడలు ఈ ఆరోపణకు కూడా ఏమీ సమా ధానమివ్వకుండా-మెదలకుండా నుంచున్నది.

లక్ష్మి ఇంతకుముందెప్పుడూ ఇక్కడికి రాలేదు. ఇవ్వాళే మొట్టమొదటగా ఆమె ఈ ఇంట్లో అడుగుపెట్టింది. లక్ష్మి అటు ఇటు తిరుగుతూ గదులన్నీ చూడసాగింది. ఏ దేళ్ళనాటి పడిపోయిన పాతయిల్లు. దానిలో మూడుగదులు మాత్రం ఏదో వుండడానికి తగినవిగా వున్నాయి. దరిద్రతా వాసం—సామాను లేనిదానిలో తెక్కే. గోడలసున్నం వూడి పోతూవుంది. మరమ్మత్తు చేయించే శక్తి లేదు. అయినా అన వసరమైన ముఠికి ఎక్కడా చూట్టానికికూడా కనపడటం లేదు.

చిన్నచిన్న వరుపులున్నాయి. చాల పరిశుభ్రంగా. రెండు మూడు - దేవీ దేవతల పటాలూ-చిన్నకోడలిచేతి కళానిపుణ తకు కొన్ని నమూనాలూ-గోడకు వ్రేలాడగట్టి వున్నాయి. ఎక్కువగా-వున్నవి-పూలుతో కుట్టిన చిత్రాలే. అవి కొత్తగా నేర్చుకున్నప్పుడు కుట్టిన ఎర్రముక్కు చిలుక, పంచరంగుల పిల్లీకాదు. విలువైన ఫ్రేములలో అమర్చబడిన 'వెల్‌కమ్' స్వాగతం, తప్పులతో రాసిన గీతాశ్లోకాలుగూడాకాదు. లక్ష్మి ఆశ్చర్యంతో "ఇది ఎవరిబొమ్మ చెల్లీ?— పరిచయమున్న మొహంలాగ కనపడుతూవుంది" అనిఅడిగింది.

చిన్నకోడలు సిగ్గుపడుతూ "తిలక్ మహారాజు బొమ్మ చూచికుట్టటానికి ప్రయత్నించాను. కాని ఏమీకుదర లేదు, అక్కా" అంటూ వేలతో ఎదురుగా గోడమీద వ్రేలాడుతూ వున్నభారత శిరోభూషణ - తిలకమహాశయుని బొమ్మ చూపించింది.

లక్ష్మిచాల సేపటివరకు దానివంకచూచి-మెల్లామెల్లగా "గుర్తించ లేకపోయాను. అది నాతప్పే చెల్లీ! నీదికాదు. నాకుకూడా నేర్పుతావా? ఈవిద్య నేర్పావంటే నిన్ను గురువుగా ఒప్పుకోటానికి నాకేం అభ్యంతరముండదు" అన్నది.

చిన్నతోడికోడలు నవ్వింది. ఆరోజున నాలుగుఅయిదు గంటలున్న తర్వాత లక్ష్మి ఇంటికి వెళ్లబోయేముందు ఆమె రేపటినుంచి కుట్టుపని నేర్చుకోటానికి రావటం-నిశ్చయమైంది.

రానాగింది కూడా. కాని పదిపదహేను రోజులలోనే ఈవిద్య నేర్చుకోవటం కఠినమే కాదు, నేర్చుకోటానికి చాలా

కాలం కూడా పడుతుందని గ్రహించింది. ఒకరోజున లక్ష్మి "నువ్వు నాకు శ్రద్ధతో నేర్పటం లేదు. చెల్లీ!" అన్నది.

"నేర్చుకోటానికి చాలా కాలం పడుతుంది అక్కా! దీని కన్న మీరు ఇంకేదైనా నేర్చుకుంటే బాగుంటుంది" అన్నది చిన్నతోడికోడలు.

లక్ష్మికి లోపల్లోపల చాల కోపంవచ్చింది. కాని దాన్ని కప్పిపెట్టుకొని "నీకు నేర్చుకోటానికి ఎంతకాలం పట్టింది చెల్లీ!" అని అడిగింది.

"నాకెవరూ నేర్పలేదు అక్కా. నాఅంతట నేనే కొంచెం......" జవాబుచెప్పింది చిన్నతోడికోడలు.

"అందుక నేనా! నువ్వుగూడా ఇతరులదగ్గర నేర్చుకుంటే కాలాన్ని అంచనా వేశేదానివి" అన్నది లక్ష్మి.

నోటితో ఆమె ఏమన్నా మేధస్సులోనూ, తీక్షబుద్ధి లోనూ ఈచిన్న తోడికోడలిముందు తనునిలవ లేనని లోలోన గ్రహించింది. ఇవ్వాళ ఆమె పాఠం సాగలేదు. వేళకాక ముందే ఆమె సూది దారం పట్టుకొని ఇంటికి వెళ్ళిపోయింది. మర్నాడూరా లేదు. ఇదే మొట్టమొదటి నాగా.

మూడునాలుగు రోజులున్న తర్వాత ఒకరోజున హారి లక్ష్మి తన సూదీ-దారం పెట్టె తీసుకొని చిన్నతోడికోడలి ఇంటికి వచ్చింది. తోడికోడలు తనకొడుక్కి రామాయణంలో బొమ్మలు చూపిస్తూ కిథ చెబుతూవున్నది. లక్ష్మిని చూడగానే ఆమె లేచి పీటవేసింది. "ఈ రెండుమూడు రోజులనుంచీ రావటం లేదు వంట్లో బాగాలేదా అక్కా!"అన్నది ఉద్విగ్న కంఠంతో.

లక్ష్మి గంభీరంగా "లేదు చెల్లీ ఈ రెండుమూడు రోజులనుంచీపూరికినే రాలేదు" అన్నది.

చిన్నకోడలు ఆశ్చర్యాన్ని కనపరుస్తూ "రెండుమూడు రోజులే ఎన్నాళ్ళో అయినట్టుంది. కాని ఇవ్వాళ రెండు గంటలు ఎక్కువవుంచి నాగాలబదులు తీర్చుకుంటాను" అన్నది.

"నావంట్లో బాగుండలేదే అనుకో. నువ్వు ఒక్కసారి అంతుకనుక్కోకూడదూ?" అన్నది లక్ష్మి.

చిన్నకోడలు సిగ్గుపడుతూ "తీసుకోవలసిందే-కాని ఇంట్లో బొడెడుపనులు-నేను వంటరిదాన్ని. ఎవర్ని పంపించను చెప్పండి? ఆ పొరపాటు జరిగిందని వప్పుకుంటాను అక్కా!" అన్నది.

లక్ష్మి లోలోన చాలా సంతోషించింది గతనాలుగు రోజులు ఆమె ఆత్మాభిమానం మూలంగానే రాలేదు. ఇంకా వెళదాం, వెళదాం అంటూనే ఆమె రోజులు గడిపింది. ఈచిన్న తోడికోడలు మినహా-ఇంట్లోనేకాదు, పూరంతట్లోనూ ఆమెమనసిచ్చిమాట్లాడేకలసిపోయేవారెవరూ లేరు.

కుర్రవాడు తన చిత్తమొచ్చినట్లు బొమ్మలు చూస్తున్నాడు. హారిలక్ష్మి వాణ్ణిపిలచి "నిఖిల్! ఇటు నాదగ్గరకు రా నాయనా!" అన్నది.

అతను దగ్గరకువచ్చినమీదట లక్ష్మి తనపెట్టెతీసి ఒక సన్నని బంగారుగొలుసు మెళ్ళోవేసి "వెళ్లు; వెళ్ళి ఆడుకో" అన్నది.

తల్లి మొహం గంభీరమైంది. "మీ గొలుసు వాడి కిస్తా రెందుకు?" అన్నది.

లక్ష్మి వికసిత వదనంతో "లేదే!" అన్నది.

"మీ రిస్తే వాడెందుకు తీసుకుంటాడు?" అన్నది చిన్న కోడలు.

లక్ష్మి సిగ్గుపడింది "పెత్తల్లి ఒకగొలుసు కూడాయివ్వ లేదాఏమిటి?" అన్నది.

"అది నాకు తెలియదు అక్కా! కాని తల్లినై వుండి నేను తీసుకోనియ్యానని మాత్రం తెలుసు. నిఖిల్ అదితీసి మీ పెద్దమ్మకు ఇవ్వు. మేము పేదవాళ్ళమేకాని, బికారులముకాదు అక్కా – అకస్మాత్తుగా అమూల్యమైన వస్తువేదైనా దొరికితే రెండుచేతులూజాపి వెంపరలాడుతాపరుగులెత్తటానికి?" అన్నది చిన్నతోడికోడలు.

లక్ష్మిస్తంభించిపోయి కూర్చున్నది కూర్చునట్టే వుండిపోయింది. ఇవ్వాళకూడా ఆమెమనసు - బ్రద్దలైపో భూమాతా అనసాగింది.

వెళుతూ ఆమె "కాని ఈసంగతి మీబావగారి చెవిని కూడా పడుతుంది చెల్లీ!" అన్నది.

"వారి సంగతులనేకము నా చెవిని పడుతూవుంటాయి నాఒక్క మాట వారిచెవిని పడితే చెవిఅపవిత్రమై పోదుగా!" అన్నది చిన్నకోడలు.

"మంచిది, కొన్నాళ్లుచూస్తే కనపడుతుంది" అన్నది లక్ష్మి.

మళ్లీకొంచెం ఆగి "బహిరంగంగా అవమానించనవసరం లేదు చెల్లీ! శిక్షవిధించటం నాకూ తెలుసు" అన్నది.

"ఇదిమీరు కోపంతో అంటున్నమాట. లేకపోతే నేను మిమ్మల్ని అవమానపర్చలేదు సాంఘికి అవమానం కలుగకుండా మాత్రం కాపాడుకున్నాను-అని తెలుసుకోనేదానిని" అన్నది చిన్నకోడలు.

"అది నేర్చుకున్నాను. కాని నీలాంటి పల్లెటూరిభామలతో పోట్లాడే విద్యమాత్రం నేర్చుకోలేదు." అన్నది లక్ష్మి.

చిన్నకోడలు ఈకటూక్తికి సమాధానమివ్వలేదు. మెదలకుండా వూరుకుంది.

లక్ష్మి వెళ్ళబోతూ "ఈగొలుసు కిమ్మతు ఎంతవున్నా నేను బిడ్డకు ప్రేమతో యిచ్చాను. నీపతికష్టాలు తొలిగించాలనేదృష్టితో కాదు. పెద్దవారు బీదవాళ్లను అవమానిస్తారని మాత్రమే తెలుసుకున్నావు గాని, వారు ప్రేమించటంకూడా ప్రేమిస్తారని తెలుసుకోలేదు. తెలుసుకోవటం అవసరం. మళ్లా వెళ్ళి కాళ్లూ చేతులూ పట్టుకు తిరక్కు—" అన్నది.

దీనికి సమాధానంగా చిన్నకోడలు కొంచెంనవ్వి "లేదు అక్కా! ఆభయం మీకవసరం లేదు" అన్నది.



# 3

వరదకోతకు మట్టికట్టలు తెగటం ప్రారంభమౌతాయి. అప్పుడు దాని అతిసామాన్యమైన ప్రారంభంచూచి ఆసన్నని నీటిధార ఇంతతక్కువకాలంలో ఆగండిని ఇంత పెద్దగానూ, ఇంత భయంకరంగానూ చేస్తుందని వూహించనుకూడా వూహించ లేము. సరిగ్గా ఇదేసంగతి హరిలక్ష్మి విషయంలోకూడాజరిగింది. భర్తదగ్గర విపినునిమీద, అతనిభార్యమీదాచేసిన ఆరోపణ లకు పరిణామాన్ని వూహించుకొని ఆమె స్వయంగా భయ పడింది. అబద్ధమాడే స్వభావం ఆమెకు లేదు. ఆడదలచినా ఆమె శిక్షామర్యాదలు వాటికి విఘ్నం కలిగిస్తాయి. అవిరమ శ్రోతలాగ ఆమె నోటినుంచి వచ్చిన మాటలలో చాలవరకు యదార్థంకాదని - ఆమెగూడా స్వయంగా తెలుసుకోలేక పోయింది. కాని వాటి వేగాన్నాపటం తనకు స్వాధీనంతప్పిన విషయంఅనికూడా గ్రహించకుండా వుండలేదు. ఒక్కవిషయ ములోమాత్రం ఆమెకు సరిగా పరిచయంలేదు. అది ఆమె భర్త స్వభావం. ఆమె భర్త స్వభావం ఎంత కఠినమైందో అంత ప్రతీకారపూరితమైందికూడాను. ఎవరిని ఎంతవరకు కష్టపెట్టాలో ఈసంగతి అతనికి తెలియనే తెలియదు. ఇవ్వాళ శివచరణుడు చిరుబురుమనలేదు. అంతావిని "సరే, అయి దారు నెలలుండినూను, రెండోఏడుగూడదాటనవసరంలేదు- ఇది సరిగా గుర్తుంచుకో" అనిమాత్రం అన్నాడు.

అవమానాగ్నితో హరిలక్ష్మి హృదయం దహించుకు పోతూవుంది. విపినునిభార్యకు బాగా శాస్తి జరగాలని హ్రా స్త

వంగా ఆమె కోరుతూవుంది. శివచరణుడు బైటికి వెళ్ళిపోయిన తర్వాత-అతనన్న ఈమామూలు మాటలు మనసులో మళ్ళా అనుకుంటేగాని శాంతికలగలేదు. ఎక్కడోఏదో మహావిపత్తు వచ్చి పడినట్లనిపించింది ఆమెకు.

కొన్నాళ్ళతర్వాత ఏదో మాటల సందర్భంలో హారిలక్ష్మి చిరునవ్వుతో "వారిని ఏమైనా చేశారా? చేయించారా?" అన్నది భర్తతో.

"ఎవరిని?"

"విపినుని"

శివచరణుడు నిస్పృహతో "ఏంచేస్తాను? ఏం చేయగలను? నేను సామాన్యమనిషిని" అన్నాడు.

హారిలక్ష్మి ఉద్విగ్నురాలై "అంటే?" అన్నది.

"మీ చెల్లెలు అంటూవుంటుందిగా రాజ్యం బావ గారిదికాదు-బ్రిటిషు ప్రభుత్వానిదని!" అన్నాడు శివచరణుడు.

"అలా అందాఏమిటి? అయితే - సరే..." అన్నది హారిలక్ష్మి.

"అయితే సరే ఏమిటి?"

భార్య కొంచెం సంశయపడుతూ "చిన్నతోడికోడలు ఎప్పుడూ అలాంటిమాటలు అనదే? చాలమంది లేనిపోని మాటలు కల్పించికూడా చెబుతూవుంటారు" అన్నది.

"దీనిలో ఆశ్చర్యపడ వలసిందేమీ లేదు. ఈమాట నేను నాచెవులారవిన్నాను" అన్నాడు శివచరణుడు.

హారిలక్ష్మికి ఈమాటయందు నమ్మకం కలుగలేదు. కాని అప్పుడుభర్తను సంతోష పెట్టటానికి కోవంకనవ్వుతూ

"ఏముంది! ఇంతగర్వమూ! నన్ను అన్నదేదో అన్నది బావ వవుతావు; నీగౌరవంకాస్త కాపాడకూడదూ?" అన్నది.

"హిందూ కుటుంబాలలో అంతా అలాగే వుంటారు. కాని ఈమెచదువుకున్నవిద్వాంసురాలుగా? అందుకే నన్నవమాన పరచి ఎవరూ బతికిబైట పడలేరు. బైటకొంచెం పని వుంది వెళతాను" అనిశివచరణుడు బైటికి వెళ్ళిపోయాడు. హరిలక్ష్మిమాట చెప్పాలనుకున్న విధంగా చెప్పలేకపోయింది. ఇంకా పైగావ్యతిరేకమైంది. భర్తవెళ్లిపోయిన తర్వాతకూడ ఆమె ఈసంగతి తలుచుకోసాగింది.

బైటకచేరికి వెళ్ళిశివచరణుడు విపినుని పిలిపించి "అయిదారేళ్లనుంచి నీతో చెబుతున్నాను విపిన్? మీ పశువులను తొలగించమనీ, రాత్రి పూటనిద్రపోవడానికి నాకుచాల ఇబ్బందిగా వుందనీ, అయితే నువ్వునామాట వినకుండావుండటానికే నిశ్చయించుకున్నావా!" అన్నాడు.

విపినుడు ఆశ్చర్యచకితుడై "నేనొకసారికూడా వినలేదే అన్నయ్యా?" అన్నాడు.

శివచరణుడు చాల చులకనగా "నా నోటితో కనీసం నీకు పదిసార్లు చెప్పాను. నీకు జ్ఞాపకంలేకపోతే ఏమీకష్టం లేదు. ఇంతపెద్ద జమీందారీని పాలించేవానిమాట మరచిపోతే కుదరదు. సరే, ఏమైనా కానీ,—ఇతరులచోటులో ఇంతకాలంపాటు పశువులను కట్టివెయ్యవచ్చునో, లేదో కొంచెం బుర్రవుపయోగించాలి. రేపే అక్కడనుంచి తొలగించు. నాకు తీరికలేదు. నీకిదే చివరిసారి చెబుతున్నాను" అన్నాడు.

విపినుని నోటివెంట అనలేమాటరాదు. దానిమీదట అత్యంతాశ్చర్యకరమైన ఈప్రస్తావనముందు అతనుఒక్కసారి స్తంభించిపోయాడు. తన తండ్రి కాలంనుంచి ఆస్థలం తనదే ననుకుంటున్నాడు. అది ఇలగులదన్న అబద్ధాన్ని అతను వ్యతిరేకించలేక మెదలకుండా ఇంటికి వెళ్ళిపోయాడు.

అతనిభార్య ఈ సంగతులన్నీవిని "ప్రభుత్వ న్యాయస్థానంవుందిగా?" అన్నది.

విపినుడు మాట్లాడలేదు. అతనెంత మంచివాడు కాకపోయినా 'బ్రిటిషు ప్రభుత్వపు న్యాయాలయుద్వారాలు ఎంత విశాలంగా తెరచివున్నా—పేదలు వెళ్ళతగ్గదారి దానిలో కించిత్ కూడా లేదని అతనికి బాగా తెలుసు. చివరకి జరిగినలసిందేదో అదే జరిగింది. మర్నాడు పెదబాబుగారి మనుషులు వచ్చి ఆపాత పశువుల సావిడి పడగొట్టి దానిస్థానే పెద్దప్రహారీ కట్టారు. విపినుడు స్టేషనుకువెళ్ళి రిపోర్టుచేశాడు. కాని ఆశ్చర్యమేమిటంటే శివచరణుని ప్రహారీగోడ తయారుకాంతవరకు అక్కడికి ఒక్క ఎర్రిటోపీగూడారాలేదు. విపినునిభార్యచేతి గాజులమ్మి దావావేయించింది. గాజులు పోయినాయేగాని జరిగింది మాత్రం శూన్యం. అతని మేలుకోరే విపినునిపెత్తల్లి ఈ ఆపదలసమయంలో విపినుని భార్యను హారిలక్ష్మి దగ్గరకు వెళ్ళమని సలహాయిచ్చింది. దీనికూడ ఆమె "సింహంముందు చేతులు జోడించుకు నుంచుంటే ఏం లాభం అత్తా? పోవలసిన ప్రాణాలు పోతాయి—ఇంకాఅనుమానమెందుకు!" అంది.

ఈమాట హారిలక్ష్మి చెవినిపడినప్పుడు మెదలకుండా వూరుకుంది. ఏ సమాధానమివ్వటానికి ప్రయత్నించలేదు.

కాశీలో గాలిమార్పు చేసుకువచ్చినతర్వాత ఒక్క రోజునకూడా ఆమె వంట్లో బాగుండలేదు. ఈ ఘటన జరిగిన సంవత్సరానికి ఆమెకు మళ్లా జ్వరం రాసాగింది. కొంత కాలంవరకు వూళ్ళోనే వైద్యం జరిగింది. కాని ఏమీ లాభం లేకపోయింది. అప్పుడు డాక్టరుసలహానుబట్టి ఆమెమళ్లా పరదేశానికి వెళ్లవలసివచ్చింది.

అనేక పనుల వత్తిడివల్ల ఈసారి శివచరణుడు వెళ్లటానికి పడలేదు. అతనువూళ్లోనే వుండిపోయాడు. వెళ్లేటప్పుడు లక్ష్మి పతితో ఒకవిషయం చెప్పటానికి లోలోన చాలమధనపడింది. కాని అతనిముందు నోరెత్తి చెప్పలేక పోయింది. వారిని మాటిమాటికి బ్రతిమాలటం అనవసరం - దీనిఅర్థం వారు తెలుసుకోలేరు - అనుకున్నది.



## ౪

హరిలక్ష్మిరోగగ్రస్థ శరీరానికి బాగా స్వస్థత చిక్కేటప్పటికి ఈసారికొంచెం దీర్ఘకాలం పట్టింది. షుమారు ఒకసంవత్సరమైన తర్వాత ఆమె బేల్‌పూర్ తిరిగవచ్చింది. ఆమె కేవలం జమీందారుకి ప్రియమైన భార్యే కాదు - ఇంత పెద్దకుటుంబానికి యజమానురాలు కూడాను. అందుచేత వీధిలో స్త్రీలంతా గుంపులుగుంపులుగా ఆమెను చూట్టానికి వచ్చారు. వరుసకు పెద్దవారు ఆశీర్వదించారు. చిన్నవారు నమస్కరించారు. రానిదల్లా ఒక్కపివినుని భార్యే. ఈసంవత్సరంలోపల

విపినుని ఇంటివారెలావున్నారో, వారిమీదనడుస్తున్న కేసులు దావాలు ఏమైనాయో - వీనిలో ఏసంగతి ఎవరివల్లా తెలుసుకోటానికే ఆమెప్రయత్నించలేదు. పతి తన్నుచూట్టానికివచ్చినప్పుడల్లా అన్నిటికన్న ముందు హారిలక్ష్మి మనసులో వారిని గురించి తెలుసుకోటానికి కుతూహలం కలిగేది - కాని ఒక్కనాడు భర్తను ఒక్కమాటకూడా అడగలేక పోయింది. అడగటానికి ఆమెకు భయమేసేది. ఇంతకాలంలో ఏదో విధంగా చక్కబడి వుంటుంది. ఇప్పుడు వీరికోపంలో అంత తీవ్రత లేదు. మళ్ళీకదిలించితే మొదటిగాయం మళ్ళారేగుతుందని - ఇప్పుడా తుచ్ఛ విషయాలన్నీ జ్ఞాపకమే లేనట్టు మెదలకుండా వుండేది. అటుశివచరణుడుకూడా ఏనాడూ విపినునిసంగతి తీసుకవచ్చేవాడుకాడు. తనభార్య అవమానం సంగతి మర్చిపోలేదు. ఆమె సరోక్షంలో దీనికి తగినఫర్వాట్లు అతనుచేసి వుంచాడన్న సంగతిహారిలక్ష్మికి చెప్పలేదు. లక్ష్మియింటికివచ్చి తనకళ్లతో అంతా చూస్తుంది. అప్పుడు ఆమె ఆనందానికి అంతువుండదని అతని మనసులో వున్నది.

ఎక్కువ పొద్దెక్కకముందే పెద్దత్త బలవంతంవల్ల లక్ష్మిస్నానంచేసి నిశ్చింతగా కూర్చున్నది. ఇంతలో మళ్లా ఆమెవచ్చి "ఇంకానువ్వు చాలబలహీనంగా వున్నావు. అమ్మా కిందకు వెళ్లకు నీకుభోజనం ఇక్కడికే తెప్పిస్తాను." అన్నది.

లక్ష్మి అడ్డుపెడుతూ నవ్వి "నా వంట్లో మునుపటంత కులాసా ఏర్పడింది అత్తా! నేను కిందకు వంటింట్లోకి వెళ్ళి భోంచేసి వస్తాను. పైకి అన్నీ మోసుకరావటం దేనికి, పద కిందకే వెళదాం" అన్నది.

పెద్దత్త 'శివుడు వద్దన్నాడు' అని ఆపింది. ఆమె అనుజ్ఞ పొంది దాసీది నీళ్ళుచల్లి పీటవేసింది. మరుక్షణంలోనే వంట మనిషి భోజనం తీసుకుని హాజరైంది. ఆమె పళ్లెంపెట్టి వెళ్ళి పోయిన తర్వాత లక్ష్మి పీటమీద కూర్చుంటూ "ఈవంట మనిషి ఎవరత్తా? ఇదివరకెప్పుడూ చూడలేదే!" అన్నది.

పెద్దత్త నవ్వి "గుర్తించలేదా ఏమిటి. చిన్నతోడికోడలు విపినుని భార్య—"అన్నది.

లక్ష్మి నిర్ఘాంత పోయింది. తనొక్కసారి ఆశ్చర్య చకితురాలను చేయటానికే ఇంత షడయంత్రంపన్ని ఈ విధంగా దాచివుంచారనుకున్నది. కొంచెంసేపట్లోనే తమా యించుకొని జిజ్ఞాసతో పెద్దత్త మొహంకేసి చూడసాగింది.

"విపినుడు చనిపోయాడు. వినేవుంటావేమో?" అన్నది పెద్దత్త.

లక్ష్మి ఏమీ విన లేదు. ఇప్పుడు ఆమె ముందు పళ్లెంపెట్టి పోయిన ఆవిడ విధవ అని ఆమె వంక చూస్తేనే కనపడుతూ వుంది. ఆమె తలకాయ వూపించి ఊ!" అన్నది.

పెద్దత్త తక్కిన గాథను గురించివర్ణిస్తూ "మిగిలింది కాస్తా దావాఖర్చులకు స్వాహా చేసి విపినుడు చనిపోయాడు. తక్కిన బాకీకింద ఇల్లుకూడా పోయేటట్టు వుందని చూచి— ఒకటిరెండు సంవత్సరాలు నీ రెక్కలకష్టం చేసుకుని బాకీ తిర్చు కనీసం కూర్చోటానికి నీకొడుక్కైనా కాస్త పంచ మిగులుతుంది - అనిమేమే సలహా యిచ్చాము" అన్నది.

లక్ష్మి తెల్లమొహంలో మెదలకుండా అలాగే కళ్లప్ప లించుకొని మెదలకుండా చూస్తూవుండి పోయింది. పెద్దత్త

ఒక్కసారి కంఠస్వరంమార్చి "అయినా నేనోకసారి వంటరిగా తీసుకెళ్ళి - జరగవలసిందేదో జరిగిపోయింది. ఇప్పుడు అప్పో సప్పో చేసుకొని ఒకసారి కాశీకి వెళ్ళిపెద్దమ్మగారి కాళ్ళమీద పడు. పిల్లవాణ్ణిచేత ఆమెపాదాలు పట్టించి - వీడితప్పేమీ లేదు అక్క వీడికాపాడు - అన మని చెప్పాను. అన్నది.

మాట్లాడుతూ మాట్లాడుతూ పెత్తల్లి కళ్లుతుడుచుకొని "నోరు మూసుకొని వంచినతల ఎత్తకుండా కూర్చుంది. అవునని కాని కాదనికాని ఒక్కమాటకూడా మాట్లాడలేదు" అన్నది.

దీని నేరమంతా నానత్తిమీదే వచ్చిపడిందని హారిలక్ష్మి గ్రహించింది. ఆమెనోట్లోఅన్నది అంతా విషమై పోయింది. మళ్ళీఒకముద్దకూడా మీద లేకపోయింది. ఏదో పని మీద పెద్దత్త బైటికి వెళ్ళికొంచెంసేపున్న తర్వాత మళ్లాతిరిగి వచ్చి లక్ష్మిపళ్లెంకేసిచూచి చకితురాలై పోయింది. "చిన్న దానా! చిన్నదానా!" అనిబిగ్గరగా పిలువ సాగింది.

విపినుని భార్యవాకిటికి బైటకువచ్చినుంచోగానే మండి పడింది, ఇంతకు ముందే కరుణతో ఆమెకళ్ళల్లో వాడిననీళ్ళు చప్పున ఎక్కడమాయమై పోయినాయో తెలియదు తీవ్ర స్వరంతో "ఇంతనిర్లక్ష్యంగా పనిచేస్తే కుదరదు! అమ్మాయి ఒక ముద్దకూడా నోటపెట్టలేదు. అంతలక్షణంగా చేశావా ఏమిటివంట" అన్నది.

వాకిటి బైటినుంచిఈ తిరస్కారానికే మీసమాధానం రాలేదు కాని ఇతరుల అవమాన భారంతో సిగ్గూవేదనల వల్ల హారిలక్ష్మి వంచిన తలఎత్తలేదు.

"వంటగత్తెనని బైలుదేరావు. ఇలా చెడగొడితే ఏమీ కుదరదు తక్కిన అయిదుగురితోపాటు నువ్వుకూడా చెయ్యాలి ఇదే చెబుతున్నాను" పెద్దత్త మళ్లా.

విపినునిభార్య ఈసారి మెల్లగా "నాశక్తి వంచన లేకుండా అలాగే చేస్తున్నాను. అత్తా! ఇవ్వాళ ఏమైందో తెలియటంలేదు అని ఆమెకిందకు వెళ్ళిపోయినమీదట లక్ష్మి లేచి నుంచోగానే పెద్దత్త గల్లంతు చేసింది. లక్ష్మి వినయంగా "ఎందుకు అలా ఇదౌతావు అత్తా? నావంట్లో బాగాలేదు అందుకని తినలేదు. ఆమెవంటలో ఏమీలోటులేదు" అన్నది.

చేతులూ మొహమూ కడుక్కుని హారిలక్ష్మి తన గదిలోకి వెళ్ళేటప్పటికి ఆమె హృదయంలో ఒకవిధమైన వ్యధ కలుగసాగింది. అనేక విధాలైన అవమానాలను సహిస్తూ కూడా విపినుని భార్య ఈ ఇంట్లో నౌకరీ చేస్తూవుంది. చిన్న తోడికోడలకు అయినా ఒక ఓర్పు వుంది. తప్పు లేకుండా దుఃఖం సహించే ఓర్పు కాని లక్ష్మికి స్వయంగా ఎక్కడ ఏమి కలిగివుంది.

రాత్రి లక్ష్మి భర్తతోయింకేంమాట్లాడుతుంది! అతన్ని సరిగా చూడనుకూడా లేకపోయింది. ఇవ్వాళ ఆమె ఒక్క నోటిమాటతో విపినుని దుఃఖమంతా దూరమౌతుంది. నిస్సహాయ అబలమీద ఇంతపగ తీర్చుకునే మఃషివద్ద అతని పౌరుషానికి ఇది నీచంగా కనపడ్డది. కాని యాచించి హీనతను కనపర్చటం లక్ష్మికి ఏవిధంగానూ మనసొప్పలేదు.

శివచరణుడు కొంచెం నవ్వి "చిన్నతోడికోడలు కనపడిందా? చెప్పు. ఎట్లా వంట చేస్తూవుంది" అన్నాడు.

హారిలక్ష్మి సమాధాన మివ్వలేకపోయింది. ఇతనే తన భర్త ఇతనితో వుండే జీవితపర్యంతం కాపరంచెయ్యాలి! అని ఆలోచించుకుంటూ ఆమె మనసులో భూమాతా! బద్దలైపో అనసాగింది.

మర్నాడు పొద్దున్నే లేవగానే హారిలక్ష్మి దాసీచేత పెద్దత్తకు కబురంపించింది జ్వరం వచ్చింది. ఇవ్వాళ తిననని.

పెద్దత్త ఆమెగదిలోకి వచ్చిజలవంత పెట్టి చంపింది. ఆమెదుఃఖవదనమూ, ఆకంఠస్వరమూ చూచి - అమ్మగారు ఏదోదాయటానికి ప్రయత్నిస్తున్నట్లు సందేహపడింది. "నీకు నిజంగా జ్వరంరా లేదు అమ్మాయి?" అన్నది.

లక్ష్మితలవూగించి బిగ్గరగా "నాకుజ్వరం వచ్చింది. బిగ్గరగా "నాకుజ్వరం వచ్చింది, నేవేంతినను" అన్నది.

డాక్టర్ని బైటనుంచే పంపిస్తూలక్ష్మి "మీామందువల్ల నాకేం లాభంలేదని మీాకు తెలుసు- మీాకు వెళ్ళండి" అన్నది.

శివచరణుడు వచ్చి - చాలాఅడిగాడు కాని ఏమాటకూ అతనికి సమాధానం రాలేదు.

మరిరెండు మూడురోజులు ఈవిధంగానే గడి చేప్పటికి ఇంట్లోవారంతా ఏదో అజ్ఞాతఆశంకతో వుద్విగ్నులైపోయారు.

ఆరోజున షుమారు మూడుఝాములకు లక్ష్మి సందు లోంచివచ్చి -నిశ్శబ్దంగాపైకి వెళుతూవుంది. పెద్దత్త వంటింటి వసారాలోంచి ఆమెను చూచి"విపినునిభార్య పని చూచావా అమ్మాయి! ఈవిడ చివరకు దొంగతనానికికూడా దిగింది" అన్నది బిగ్గరగా.

హారిలక్ష్మి దగ్గరకు వెళ్ళి నుంచున్నది. చిన్నకోడలు మెదలకుండా తలవంచుకొని కూర్చునివుంది. ఒక తపాలాలో

కొంచెం అన్నం అంగవస్త్రంతో మూతవేసివుంది. పెద్దత్త దాన్ని చూపిస్తూ "నువ్వే చెప్పు అమ్మాయి! ఇంత అన్నం కూర ఒక మనిషి తినగలడా? ఇంటికి తీసుకెళుతూవుంది కొడుక్కు అనేకసార్లు చెప్పాను. శివచరణుని చెవిని పడింది. ఇంకేం వుండాలి. మెడపట్టుకు బైటికి గెంటేస్తాడు. నువ్వు యజమానురాలవు, దీనికి న్యాయం చెప్పు" అని పెద్దత్త. తన కర్తవ్యం మొదట పూర్తయినట్లు శ్వాసవిడచింది.

పెద్దత్త గల్లంతు విని ఇంట్లో నౌకరు-చాకర్లంతా పరుగెత్తుకు వచ్చి తమాషా చూడసాగారు. వారందరి మధ్యా చిన్నకోడలూ-వారి యజమానురాలు కూర్చుని వున్నారు.

ఇంత అల్పవిషయానికి ఇంత కాండ జరుగుతుందని లక్ష్మి స్వప్నంలోకూడా అనుకోలేదు. ఈ అభియోగానికి ఏం సమాధానం చెబుతుంది? లజ్జాభిమానాలతో ఆమె తలకూడా ఎత్తలేకపోయింది. లజ్జ ఇంకెవరికీ కాదు - తనకే. ఆమె కళ్ళ వెంట కన్నీరు కారసాగినై ఇంత మందిముందు ఆమెపట్టుబడినట్టూ విపినునిభార్య దాన్నివిచారించటానికి కూర్చున్నట్టు అనిపించింది.

రెండుమూడునిమిషాలు అలాగేఉండి చప్పున తమాయించుకొని లక్ష్మి "మీరంతా వెళ్ళిపోండి పెద్దత్తా!" అన్నది.

ఆమె సైగననుసరించి అంతావెళ్ళిపోగానే లక్ష్మి తోడికోడలు దగ్గర కెళ్ళికూర్చుంది. చేతో ఆమె మొహమెత్తిచూచింది. ఆమెకళ్ళవెంటకూడా బొటబొట కన్నీరుకారుతూ వున్నాయి. "నేను మీఅక్కనుచెల్లీ!" అనిఆమె తనపయట చెంగుతో ఆమెకన్నీళ్లు తుడిచింది



# చిత్రకారుడు

ఈ కథ జరిగేటప్పటికి బర్మా దేశము ఇంగ్లీషువారి ఆధీనం కాలేదు. అప్పుడు దానికొక రాజున్నాడు రాణీవున్నది మిత్ర రాజులున్నారు, సైన్య సామంతులున్నారు. వారే స్వయంగా తమ దేశాన్ని పాలించుకుంటున్నారు.

మాండలే రాజధాని. కాని రాజవంశంలో అనేక మంది అనేక పట్టణాలలో వాసమేర్పరచుకొని స్థిరపడిపోయారు.

వారిలోంచి ఎవరో ఒక రాజవంశీయుడు చాలకాలం క్రిందట పేగ్‌కి అయిదుకోసుల దక్షిణాన ఇమేదిన్ గ్రామం వచ్చి స్థిరపడిపోయాడు.

అతనికి విశాలమైన ప్రాసాదాలు, సుదీర్ఘమైన వుద్యానవనాలూ, తగినంత ధన సంపత్తీ, పెద్ద జమీందారీవున్నాయి. పరలోకాన్నుండి పిలుపు వచ్చేటప్పటికి వీటన్నిటి యజమాని మిత్రుణ్ణి పిలచి "హరిబాబూ, నీకుమారునికి నాకుమార్తె నిచ్చి చెయ్యాలని వుంది. కాని ఆశుభ ఘడియలు నేను చూడలేక పోయాను. కళ్యాణిని విడచిపోతున్నాను. ఆమెను కనిపెట్టుతు వుండు" అన్నాడు.

ఇంతకన్న ఎక్కువ చెప్పే అవసరం కనిపించలేదు. అతనికి హరిబాబు బాల్యస్నేహితుడు. ఒకరోజున అతని

వద్దకూడా బాగాధనసంపదలున్నాయి. కాని గుళ్లుగోపురాలు కట్టించటమూ, యాచకులకు దానధర్మాలు చేయటంతో సర్వం నాశనం చేసుకోవటమేగాక చాల రుణపడిపోయాడు. అయినా జీవితంలో తన ఈబాల్యస్నేహితుని గుర్తించ టానికి అతనికి చక్కని అవకాశం దొరికింది. చివరకి తన సర్వస్వంతోబాటు ఏకైక పుత్రికను కూడానిర్భయంగా అతని చేతికి అప్పగించడానికి కించిత్ గూడా వెనుకాడలేదు. కాని హారిబాబుగూడా ఈదాయిత్వాన్ని ఎక్కువకాలం వహించ నవసరం లేకపోయింది. అతనికి గూడా 'అద్దరి' సమన్సు వచ్చాయి. ఆమహోన్నమైన పరమానాను శిరసావహించి ఆవృద్ధుడు సంవత్సరం తిరిగి రాకముందే ఎక్కడి భారం అక్కడవదిలివేసి అజ్ఞాతంకేసి వెళ్లిపోయాడు.

ఈ ధర్మపాణియందు గ్రామవాసులకు ఎంత సద్భా వమూ' శ్రద్ధాభక్తులు వున్నాయో అంత ప్రచండోత్సాహం తోనే - అతని అంత్యక్రియలు జరిపారు.

హారిబాబుమృతకళేబరాన్ని పూలమాలతోనూచందన సుగంధాలతోనూ అలంకరించి, నృత్యగీతాలతో, మేళతాళా లతో స్మశానవాటికకు తీసుకెళ్లారు. అతను వృద్ధాప్యంలో మళ్లానజీవంగా వూరేగుతున్నాడా అనిపించింది.

పితృశోకపు ఈ వుత్కటానందోత్సవం నుండి క్షణం సేపు ఏదోవిధంగా పారిపోయి వచ్చే శేఖర్ ఒక నిర్జన వృక్షం కిందకూర్చుని ఏడుస్తున్నాడు. ఇంతలో హఠాత్తుగా త్రుళ్ళిపడి వెనక్కి తిరిగి చూచేటప్పటికి-కళ్యాణి నుంచునివుంది. ఆమె పయటచెంగుతో మొదలకుండా అతని కళ్లుతుడిచింది. తర్వాత

చెంతకు వచ్చి కూర్చుని అతని కుడిచేతిని తన చేతిలోనికి తీసుకొని మెల్లగా "బాబుగారు చనిపోయారు. కాని నీ కళ్యాణి ఇంకా బ్రతికే వుందిగా!" అన్నది.

శేఖర్ బొమ్మలు గీస్తూ వుంటాడు. తను గీచిన ఆఖరు చిత్రం ఒక వ్యాపారస్తుని ద్వారా రాజదర్బారుకు పంపించాడు. రాజు ఆ చిత్రాన్ని చూచి సంతసించి బహుమూల్యమైన తన ముద్రికను బహుమతిగా యిచ్చాడు.

ఆనందంతో కళ్యాణి కళ్లవెంట నీళ్లుతిరిగినాయి. ఆమె ఆతనిపక్కను నుంచుని మృదుస్వరంతో "ప్రపంచంలో నువ్వుఅందరికంటె గొప్ప చిత్రకారుడవౌతావు శేఖర్!" అన్నది.

శేఖర్ నవ్వి "అయితే నేను బాబుగారి ఋణంతీర్చుకోగలనన్నమాటే!" అన్నాడు.

ఉత్తరాధికార సూత్రం ప్రకారం కళ్యాణే అతనికొక విధంగా పెట్టుబడిదారు. అందుచేత ఆమె ఈమాటకు చాల సిగ్గుపడి "నువ్వుమాటమాటకూ ఈవిధంగా ఎత్తిపొడిచావంటే నేను మళ్లా నీదగ్గరకేరాను" అన్నది.

శేఖర్ మెదలకుండా వూరుకున్నాడు. కాని తండ్రి ఋణం తీర్చలేకపోతే ముక్తికలుగదన్నమహావిపత్తి సంగతి జ్ఞాపకం రాగానే అతని హృదయాంతరాళమంతా కంపించిపోయేది.

ఇప్పుడు శేఖర్ పరిశ్రమ చాల ఎక్కువైంది. అతను జాతకకథలో ఒకప్రసంగాన్నిచిత్రంగాతీసిగీస్తున్నాడు.ఇవ్వాళ రోజుల్లా ఆతనికి తలెత్తి చూట్టానికి కూడా తీరిక దొరకలేదు.

కళ్యాణిరోజూలాగ ఇవ్వాళకూడవచ్చింది. శేఖర్ పడక గదీ, చిత్రాలు గీచుకునే గదీ అమెస్వయంగా తనచేతులతో సర్ది, సామానంతా పొందికగా అమర్చిపోతూవుండేది. ఈపని భారంఅంతా నౌకరుచాకర్ల మీద పెట్టే ధైర్యంలేక పోయింది ఆమెకు.

ఎదురుగా ఒకనిలువుటద్దంవుంది. దానిలోనుంచి శేఖర్ ప్రతిబింబం కనపడుతూవుంటుంది. కళ్యాణిచాలాసేపుదాని కేసి తదేకధ్యానంతో చూచిన తర్వాత ఒకనిట్టూర్పువిడచి "శేఖర్ నువ్వునాలాగ ఆడపిల్లవై తే ఈపాటికి - దేశానికి రాణివయ్యే దానివి" అన్నది.

శేఖర్ తలెత్తి నవ్వుతూ "ఎలాగా? చెబుదూ!" అన్నాడు.

"రాజునిన్ను పెండ్లాడి తనసింహాసనం మీద కూర్చో పెట్టుకుంటాడు. అతనికి ఇంకా అనేకమంది రాణులున్నప్పటికీ ఇలాంటి ఛాయ, ఇలాంటినుదురు, ఇలాంటి మొహమూ వారిలో ఎవరికుంటాయి?" అనిఅతను తనపనిలో లగ్నమ య్యింది. అతను మాండలేలో బొమ్మలు గియ్యటంనేర్చు కుంటున్నప్పుడు - అప్పుడప్పుడూ ఈమాటే వినవచ్చేసంగతి శేఖర్ కి జ్ఞాపకమొచ్చింది.

అతనునవ్వి "రూపాన్ని దోచుకోటానికి కేదైనా వుపాయముంటే బహుశానన్ను తొలగించి నువ్వుస్వయంగా రాజుకు ఎడమవైపున కూర్చుంటావేమో!" అన్నాడు.

కళ్యాణి ఈఅభియోగానికేమీ సమాధానమివ్వలేదు. కానిలోలోన "నీవుస్త్రీలాగ దుర్బలుడవు, కోమలమైనవాడివి

అందమైనవాడివి – నీరూపం అపారమైనది' అనుకున్నది.

ఆమెమనసులో అతనిరూపంముందు తన్నుచాలతుచ్ఛరాలనను కున్నది.



## 3

ప్రతి సంవత్సరమూ వసంతారంభంలో ఈ మేదినీ గ్రామంలో అత్యంతసమారోహణలో గుర్రపుపందాలు జరుగుతూవుంటాయి. దానికోసమే, ఇవ్వాళ వూరిబైట మైదానంలో పెద్దగుంపు పోగైంది.

కళ్యాణి మెల్లగా శేఖర్ వెనుకకు వచ్చి నుంచున్నది. అతను ఏకాగ్రచిత్తంతో చిత్రం గీస్తున్నాడు. అందుచేత ఆమె అడుగుల చప్పుడు వినపడలేదు.

"నేను వచ్చాను, కొంచెం వెనక్కి తిరిగైనాచూడు" అన్నది కళ్యాణి. శేఖర్ చకితుడై వెనక్కి తిరిగిచూచి "తలవని తలంపుగా ఇవ్వాళ ఇంతయిుస్తాబు దేనికి?" అని అన్నాడు.

"అరే, ఇవ్వాళ మనవూళ్లో గుర్రపు పందాలని నీకు తెలియదా ఏమిటి ? గెలిచినవారు ఇవ్వాళ నా మెళ్లో మాలవేస్తారు."

"ఏమో, నాకు తెలియదే" అని శేఖర్ మళ్లా తూలిక తీసుకోబోతూ వుండేటప్పటికి కళ్యాణి అతన్ని కౌగలించు

కొని "లేదు. నీకు తెలుసు. లే, ఇంకెంత ఆలస్యం చేస్తావు?" అన్నది. వీరిద్దరూ బహుశా సమాన వయసు గలవారే. శేఖర్ నాలుగైదు నెలలు పెద్ద అయితే కావచ్చు, కాని బాల్యం నుంచి వారీవిధంగానే పంథొమిదేళ్లు గడిపారు. ఆడారు, పాడారు, కొట్టుకున్నారు తిట్టుకున్నారు, ప్రేమించుకున్నారు.

ఎదురుగా నున్న పెద్దనిలువుటద్దంలో రెండు మొహాలు రెండు గులాబి పువ్వులలాగ వికసించాయి. శేఖర్ వాటిని చూపించి "వాటినిచూడు" అన్నాడు.

కళ్యాణి కొంచెంసేపు వరకు మెదలకుండా అతృప్త నేత్రాలతో చిత్రాలా అన్నట్టు వాటిరెంటి కేసిచూస్తూవుండి పోయింది. ఇవ్వాళ అగస్మాత్తుగా – మొట్టమొదటసారి – నేను కూడా చాలఅందగత్తెను – అనుకున్నది. ఆనంద పరవశంతో ఆమెకళ్లుమూసుకొని – అతని చెవిలోమెల్లగా "నేనుచందుృని కళంకం లాంటిదాన్ని" అన్నది. శేఖర్ ఆమెమొహాన్ని మరింత దగ్గరకులాక్కొని "లేదు, నువ్వుచందుృని కళంకమూకాదు, ఎవరి కళంకమూకాదు. నువ్వుజాబిల్లి వెలుగువు. ఇంకొకసారి బాగాచూచుకో" అన్నాడు.

కాని కళ్యాణికి కళ్లుతెరవటానికి ధైర్యం లేకపోయింది. అలాగే రెండు కళ్లూమూసుకుని కూర్చుంది.

బహుశా చాలా సేపటివరకు ఇలాగేగడచి పోయే దేమో కాని అప్పుడు ఒకపెద్దగుంపు ఆడుతూ పాడుతూ ముందునుంచి వెళ్ళటం కనపడింది. కళ్యాణి ఆతురతతో లేచి నుంచుని "పద వేళయింది" అన్నది.

"కాని నేను రావటంకుదరదు కళ్యాణీ!"

"ఎందుకని?"

"నేను ఈచిత్రాన్ని అయిదురోజులలో పూర్తిచేసుకు వస్తానని మాటయిచ్చాను."

"వాయిదానాటికి యివ్వకపోతే?"

"మాండలే వెళ్ళిపోతాడు. చిత్రమూ తీసుకోడు, డబ్బూ యివ్వడు"

డబ్బుమాట రాగానే కళ్యాణి బాధపడుతుంది, సిగ్గుపడుతుంది. ఆమె కోపగించుకొని "నేను దీనికోసం ఎళ్ళు విరగ్గొట్టుకోనివ్వను" అన్నది.

శేఖర్ ఈమాటకేమీ సమాధాన మివ్వలేదు. కాని పితృ రుణాన్ని గురించి-జ్ఞాపకం రాగానే-అతని మొహంమీద ఆవరించినమాలిన్యాన్ని మరో వ్యక్తి దృష్టిసికూడా పడింది.

"చిత్రం నాకు అమ్ము. నేను రెట్టింపుధర యిస్తాను" అన్నది కళ్యాణి.

శేఖర్‌కి దీనికేమి సంశయంలేదు. నవ్వి "దీన్నేం చేసుకుంటావు?" అన్నాడు.

కళ్యాణి మెడలోని బహుమూల్యమైన మణిహారము చూపించి "దీనిలో ఎన్ని మణులు, ఎన్ని ముత్యాలు ఉన్నయో వాటన్నిటితో ఈ చిత్రాన్ని అలంకరిస్తాను. తర్వాత పడక గదిలో ఎదురుగుండా పెట్టుకుంటాను." అన్నది.

"ఆతర్వాత ఏమి చేస్తావు?"

"తరువాత కిటికీలోంచి - పున్నమచంద్రుని వెన్నెల వెలుగులు నిద్రపోతున్న నీ మొహం మీద నాట్యమాడుతున్నపుడు..."

"ఆతర్వాత..."

"ఆతరువాత - నీనిద్రాభంగం చేసి............"

మాటపూర్తి కానేలేదు. ఇంతలో బండివాని పిలుపు వినిపించింది. కళ్యాణి బండి కిందనుంచునివుంది.

శేఖర్ విసుక్కొని "ఆ తర్వాత సంగతి మళ్లా వింటాను - ఇప్పుడప్పుడేకాదు. నీకు వేళైపోయింది. త్వరగా వెళ్లు" అన్నాడు.

కాని ఈవిధంగా కాలం గడచిపోతున్నదన్న చింత కళ్యాణి ఆచరణలో కించిత్ కూడా కనపడలేదు. ఆమె మరింత స్థిమితంగా కూర్చుని "నావంట్లో బాగాలేదు. నేను వెళ్ళను" అన్నది.

"వెళ్లవా? మాటయిచ్చావుగా! నీకోసం అంతా వుత్సుకతతో మెడలెత్తుకుచూస్తూవుంటారు - నీకు తెలియదు"

కళ్యాణి - తలకాయ మరింత వూపి "చూస్తూవుండనీ మాటపోతుందని నాకేం సిగ్గులేదు. నేను వెళ్లను" అన్నది.

"చా! చా! అలాచెయ్యకు!"

"అయితే నువ్వుకూడా రా!"

"రాగలిగితే తప్పకుండా వస్తాను. కాని నామూలంగా నీ మాట పోగొట్టనివ్వను. ఇక ఆపుచెయ్యకు"

అతని గంభీరవదనమూ, శాంత దృఢకంఠమూ విని కళ్యాణి లేచినుంచున్నది. అభిమానంతో ఆమె మొహం ఎర్రబడిపోయింది "నువ్వు నీవీలుకోసం నన్ను దూరంగా కొట్ట దలచుకొన్నావు. దూరంగా నేనే పోతున్నాను. ఇంకెప్పుడూ నీ దగ్గరకు కూడారాను" అన్నది.

నిమిషమాత్రంలో శేఖరుని కర్తవ్యదృఢత్వం ప్రేమ జలంలో కరగిపోయింది. ఆమెను చెంతకు లాక్కుని నవ్వుతూ "అంత ప్రతిజ్ఞ చేయకు కళ్యాణీ! దాని పరిణామ మేమౌతుందో నాకు తెలుసు. కాని ఇంకెక్కువ విలంబనం చేస్తే లాభం లేదు'' అన్నాడు.

కళ్యాణి అలాగే మాలిన వదనంతో "నేలేకుండా నీ తిండి తిప్పలదగ్గరనుండి - పండుకునేంతవరకు అన్నివిషయాల లోనూ - నువ్వే స్థితిలో వుంటావో దాన్ని నేను సహించలేని సంగతి నీకు తెలుసు. అందుకనే నువ్వునన్ను ఇవ్వాళ ఇక్కడ నుండి కదిలించ గలిగావు'' అని సమాధాన మిచ్చింది.

అని ఆమెసమాధానికి ఎదురు చూడకుండానే త్వరగా ఇంట్లోంచి వెళ్ళిపోయింది.



## ౪

అపరాహ్ణ సమయాన కళ్యాణి సవారి బండిమీద మైదానానికి చేరుకునేటప్పటికి అక్కడపోగైన జనంలో పెద్ద కలవరము చెలరేగివుంది.

ఆమె తరుణి, రూపసి, అవివాహిత. అపార ధనరాశికి అధికారిణి, మానవ యావ్వనరాజ్యంలో ఆమెస్థానం చాల వున్నతమైనది. అందుచేత ఇక్కడ కూడా బహుమతులస్థానం ఆమెకే ప్రత్యేకించ బడింది. ఇవ్వాళ ఆమె పుష్పమాలా

కృతచేయుబడుతుంది. తర్వాత అందరి కంటె ముందుగా ఈ రమణి మెళ్ళో జయమాలవేయుగలిగిన అదృష్టవంతుడుఇవ్వాళ జగత్తుకంతటికి ఒకవిధమైన ఈర్ష్యా వస్తువై పోతాడు.

అలంకృతములయిన అశ్వములపై రక్తవసనధారులయిన యువకులు ఉత్సాహహర్షంతో తయారవుతున్నారు. చూడటానికి నేడు ప్రపంచములో వారికి అసాధ్యమైన దేదీ లేదనిపిస్తుంది నిర్ణీత సమయం ఆసన్నమయింది. అదృష్ట పరీక్షకు, అందరూ ఒకపంక్తిగా నిలబడివున్నారు. క్షణకాలమయిన తర్వాతగంట తోపాటు, జీవన్మరణాశలను వదలి తమ గుఱ్ఱాలను వదలారు.

ఇదివీరత్వం ఇదియుద్ధాంశము. కళ్యాణి తండ్రి, తాత, అంతా సైనికులే. యుద్ధంచేయడమేవారివృత్తి. స్త్రీ అయినప్పటికీ ఆమెరక్తంకూడ శరీరమంతటా పొంగిపోయింది. విజయం పొందిన వానికి ఆమెహృదయ పూర్వకంగా స్వాగత మియ్యకుండావుండ లేదు.

అందుచేత ఒకఅన్యగ్రామవాసి - అపరిచిత యువకుడు - శ్రమజల పూరిత కరంతో ఆమెకు జయమాలవేసినప్పుడు - అనేకులరమణులకు కంటగింపుగా వుండకతప్పలేదు.

తిరిగి వచ్చేప్పుడు ఆమె అతనికి తనబండిలో స్థానమిచ్చి నిండు గొంతుకతో "మీవిషయంలో నేనుచాల భయపడ్డాను. ఒకసారి ఇంత ఎత్తయినగోడ దూకేప్పుడు శాస్త్రకాలుజారితే ఏమౌతుందో ననిపించింది" అన్నది.

యువకుడు వినయంగా తలవంచుకున్నాడు. ఈఅసామాన్య సాహసీ, బలిష్టవీరునితో కళ్యాణిలో లోన తన ఆ దుర్బలకోమల చిత్రకారునినవిపోల్చకుండా వుండ లేకపోయింది.

యువకుని పేరు దివాకరుడు. మాటలసందర్భంలో అతను వున్నత కులస్తుడనీ, ధనవంతుడనీ, ఆమెకు దూరపు బంధువనీ కూడా తెలిసింది.

కళ్యాణి ఇవ్వాళ వారినందరినీ భోజనానికి పిలచింది. వారంతా బండివెనుక గుంపుగా వస్తున్నారు. అనంత కోలాహాలాలతోనూ, తాండవ నృత్యాలతోనూ చెలరేగిన ధూళి మేఘాలతో, అసభ్య సంగీతంతో అప్పటి సంధ్యాకాశం ఒక్కసారి కమ్ముకుపోయింది.

ఈజనసమూహం తన ఇంటిముందునుంచి సాగిపోవుతూ వుండేప్పటికి శేఖర్ క్షణంసేపు తనపని వదిలిపెట్టి కిటికీ దగ్గరకు వచ్చి మెదలకుండా చూస్తూ నిలబడిపోయాడు. రాత్రి భోజనాలైన తర్వాత మరునాడు కళ్యాణి శేఖర్‌తో "నిన్నరాత్రి చాల ఆనందంగా గడచింది. శ్రీధత్తో చాల మందివచ్చారు. తీరిక వుండదని నిన్నొక్కణ్ణి మాత్రం పిలవ లేదు" అన్నది.

అతనా చిత్రాన్ని ప్రాణప్రదంగా తయారుచేస్తున్నాడు. అందుచేత వంచిన తల ఎత్తకుండానే "మంచిపని చేశావు" అని మళ్ళా తన పనిలో మగ్నమై పోయాడు.

కళ్యాణి ఆశ్చర్యంతో స్తంభించి పోయింది. కబుర్ల భారంతో ఆమె కడుపుబ్బి పోతూవుంది. పనితొందరవల్ల నిన్న శేఖర్ వుత్సవంలో పాల్గొనలేక పోయాడు. అందుచేత ఇవ్వాళ అతనితో చాలసేపటివరకు, చాలమాటలు మాట్లాడదామని వచ్చింది ఆమె. కాని ఇక్కడ అంతా వ్యతిరిక్తమై పోయింది. ఒంటరిగా పరిలాపాలు జరుగుతాయేమోగాని ఆలా

పాలు జరగవు. అందుచేత ఆమె స్తబ్ధురాలై కూర్చుని వుండి పోయింది. ప్రబలవుదాసీనత, గంభీర నీరసంతో నున్న పర పక్షపు ద్వారాలను తెరచి ఏవిధంగానైనా లోపల ప్రవేశి స్తానన్న నమ్మకం లేకపోయింది ఆమెకు. ప్రతిరోజూ ఆమె చేసే చిన్న చిన్న చిల్లర పనులన్నీ అలాగే పడివున్నాయి. ఏపని లో చెయిజేసుకోటానికీ ఆమెకు మనస్కరించలేదు. ఈవిధంగా చాలసేపు గడచిపోయింది. ఒక్కసారికూడా శేఖర్ తలెత్త లేదు? ఒకసారికూడా ఏప్రశ్నా వెయ్యలేదు. నిన్నటి మహా ఘటనయందు అతనికి లేశమాత్రంకూడా కుతూహలం లేనట్టే పనిమధ్య శ్వాస తీసుకోటానికికూడా అతనికి తీరికలేక పోయింది.

చాలసేపటి వరకు ఆమె మెదలకుండా సిగ్గుపడుతున్నట్టు కూర్చున్నది. చివరికి విసిగి లేచి నుంచుని "సరే ఇక వెళ తాను" అన్నది.

శేఖర్ చిత్రంమీద దృష్టి తొలగించకుండానే "అయితే పద" అన్నాడు.

వెళ్ళేప్పుడు కళ్యాణి మనసులో తను ఈమనుష్యుని అంతర్యంలో సంగతులు తెలుసుకున్నానని పించింది. అడుగు దామనుకున్నది, ఒకసారి అడగాలని కోర్కెకూడా కలిగింది. కాని నోరెత్తలేక మెదలకుండా బైటికి వెళ్ళిపోయింది.

ఇంట్లో అడుగుపెట్టగానే దివాకరుడు కూర్చునివుండ టం చూచింది. గత రాత్రి ఆనందోత్సవాన్ని గురించి ధన్య వాదాలర్పించటానికి వచ్చాడు. అతన్ని కళ్యాణి బాగా కూర్చోబెట్టింది.

ఆవ్యక్తి మొదట కళ్యాణి ఐశ్వర్యం సంగతి ఎత్తాడు. తర్వాత కుల గోత్రాల విషయమూ. ఆతర్వాత ఆమె తండ్రి గారి ఖ్యాతిని గురించీ రాజదర్బారులో వారి మాన సన్మా నాల విషయమూ చెప్పాడు. ఈవిధంగా అతను అనర్గళ ధారగా ఏమేమివాగుతూ పోయాడో తెలియదు.

ఆమె వాటన్నిట్లో కొన్ని విన్నది. కొన్ని ఆమె పర ధ్యానపు చెవులలో పడనేలేదు. అతను కేవలం బలశాలి సాహసమైన రాతేకాదు అత్యంత ధూర్తమానవుడుకూడాను. అతను కళ్యాణి వుదాసీనతను ధ్యానం చెయ్యలేదు. మామూండలే రాజపరివార విషయంతో ప్రారంభించి చివరికి ఆమె సౌందర్య చర్చలోకి తీసుకొచ్చాడు. అతను మహావినమ్ర నిలాగ - మాటిమాటికి ఆ రమణిసౌందర్య యౌవనాలను గురించిన ప్రసంగాలు తీసుకురావటం చూచి ఆమెకు లోలోన చాల సిగ్గనిపించింది. కాని దానివల్లకూడా ఒక విచిత్రమైన ఆనందమూ, గౌరవమూ పొందకుండా వుండలేకపోయింది.

సంభాషణ ముగిసిన తర్వాత దివాకరుడు శెలవుతీసు కొని వెళ్లబోతూ రాత్రి భోజనానికి ఆహ్వానం పుచ్చుకొని మరీ వెళ్ళాడు.

కాని అతను వెళ్లిపోయిన తర్వాత కళ్యాణి మనసంతా ఆసంభాషణలను తలచుకొని క్లేశపడసాగింది. పొరపాటున నోరుజారి పిలచిన ఈ నిమంత్రణమూలంగా ఆమె వ్యధకూ విరక్తికీ అంతులేక పోయింది. అప్పుడామె చప్పున నౌకరు చేతికిచ్చి మరికొంతమంది బంధువులకు కూడా ఆహ్వానాలు పంపింది. అతిథులు వేళకు హాజరయ్యారు. ఇవ్వాళకూడా సరస

సల్లాపాలతో నృత్యగీతాలతో భోజనాలు ముగిసేప్పటికి ఇంకెక్కువ పొద్దులేదు.

వ్యథతో ఆమె పండుకుంటానికి వెళ్ళింది. కాని కంటికి కునుకు పట్టలేదు. ఆశ్చర్యమేమిటంటే ఇంతసేపటి నుంచీ ఆనందవినోదాలాడుతున్న వారిలో ఎవరిసంగతీ ఏమాటా ఆమె మనసులోనికి రాలేదు. అదంతా అనేక యుగాలనాటి అకించిత్కర ఘటనవట్టి స్వప్నమూ నీరసమూ అయినట్టి ఆమెకు ఒక వ్యక్తిమాత్రం మాటిమాటికీ జ్ఞప్తికిరాసాగాడు. ఆమె వుద్యాన వనంలో ఒకమూల నిర్జన గృహంలో నిర్విఘ్నంగా వున్నాడు. నేటి ఈ వేడుక వినోదాలు, నృత్యగానాలు ఏవీకూడా అతని చెవిని పడటానికి కాస్తదారికూడా దొరుకలేదు.

చిరపరిచిత ప్రభాతం కాగానే కళ్యాణి మనసు ఆరాట పడ సాగింది. ఇవ్వాళ ఆమె మళ్ళా శేఖర్ గదిలో కెళ్ళి కూర్చుంది. రోజులాగానే ఇవ్వాళకూడా అతను 'రా' అన్న ఒక్కమాటతో అతని సహజ అభ్యర్థనా కార్యక్రమాన్ని ముగించుకొని తన పనిలో లీనమైపోయాడు. దగ్గర కూర్చున్నాకూడా కర్మనిరతుడైన ఈ మానవుని నీరవతే ఆమె నుండి చాలదూరము పోయిందనిపించింది కళ్యాణికి.

మాట్లాడించటానికి కళ్యాణికిఎంత వెదకినా ఏప్రసంగము దొరకలేదు. తర్వాత సిగ్గువిడచి "నీకింకా ఎంత పనివున్నది?" అన్నది.

"చాలా"

"అయితే ఈరెండు రోజులలోను ఏమిచేసావు?"

శేఖరు దీనికేమీసమాధానమివ్వక సిగరెట్టుపెట్టె ఆమె వైపుచూపి "నేనీ సారాయి వాసనను సహించలేను" అన్నాడు.

కళ్యాణి ఈసంజ్ఞను గ్రహించింది. ఆమె మండిపడి సిగరెట్టుపెట్టెను విసిరికొట్టి "నేను పోద్దున్నే సిగరెట్టుకాల్చి సిగరెట్టుతో వాసనను కప్పెట్టుకొనుటకు ప్రయత్నించను. నేనేమీ లేకిజాతి బిడ్డనుగాను" అన్నది.

శేఖరు తలఎత్తి శాంతస్వరముతో "బహుశా నీగుడ్డలకు ఎక్కడైనా అయిందేమో నేనేమి కల్పించి చెప్పాటం లేదు" అన్నాడు.

కళ్యాణి మెరపులాగ ఒక్కసారి లేచి నుంచుని "నువ్వు ఎంత నీచుడవో అంత ఈర్ష్యాళుడవుకూడాను. అందుకనే నన్నీవిధంగా అవమానపర్చావు. సరే నేను నాబట్టలను నీ యింటినుండి శాశ్వతంగా తీసుకుపోతున్నాను" అని ఆమె సమాధానానికి ఎదురుచూడకుండానే వెళ్ళబోతూ వుండేటప్పటికి శేఖర్ వెనుకనుండి పిలచి శాంతంగా "నన్నింతవరకు ఎవరూ నీచుడనిగాని ఈర్ష్యాళుడనిగానీ అనలేదు. నువ్వు ఒక్కసారి ఈఅధః పతనమార్గాన అడుగుపెట్టటానికి వుద్యుక్తురాలవయ్యావు. కాబట్టి నేను నిన్ను సావధానపర్చాను" అన్నాడు.

కళ్యాణివెనక్కి తిరిగి నుంచుని "నేను అధఃపతన మార్గాన అడుగుపెడుతున్నానా!" అన్నది.

"నాకు అలాగే కనపడుతూ వుంది"

"సరే తనబిడ్డల్ని ఆశీర్వదించిపోయినతండ్రి అతనితో నీమనసు కలవదని - శపించిపోలేదు"

అని ఆమె వెళ్లిపోయింది. కాని శేఖర్ అక్కడే కూర్చునిపోయాడు. ఎవరికైనా ఏకారణంచేతయినా ఇంత బద్ధవైరమేర్పడుతుంది, ఇంత పగాఢపేమ ఒక్కరోజులో మహాకాలకూట విషమౌతుందని అతను వూహించను కూడా లేదు.

కళ్యాణి ఇంటికివచ్చి చూచేటప్పటికి దివాకరుడు కూర్చునివున్నాడు. అతను అత్యంతాదరంతో లేచి నుంచుని తియ్యని చిరునవ్వు నవ్వాడు.

చిరునవ్వుచూచి కళ్యాణికి తెలియకుండానే కోపం వచ్చింది "మీకు అవసరమైన పనేమైనావుందా?" అన్నది.

"లేదు అవసరమైన పనేమీ—

"అయితే ఇప్పుడు నాకు తీరికలేదు" అని కళ్యాణి మెట్లెక్కి పైకి వెళ్ళిపోయింది.

గత రాత్రి సంగతి తలుచుకొని దివాకరుడు ఒక్కసారి హతబుద్ధియైపోయాడు. కాని నౌకరు కనపడగానే అతను ఉమ్మవదనంతో ఒకరూపాయి చేతిలోపెట్టి బైటికివెళ్ళిపోయాడు.

౬

బాల్యంనుండీ ఒక్క క్షణంసేపుకూడా ఒకరినొకరు విడనాడియుండలేనివారు-దురదృష్టవశాత్తు ఇప్పటికి ఒకనెల రోజులైంది ఒకరినొకరు కలుసుకొని.

'ఇది ఒకవిధంగా నా మంచికే జరిగింది. ఇంతకాలం నుండి నన్ను కఠినబంధనాలలో బంధించియుంచిన అతని మోహజ్వాలలు పటాపంచలైపోయినాయి. ఇప్పుడు నాకు

అతనితో ఏం సంబంధంలేదు' అని మనసును కుదటపర్చుకో టానికి ప్రయత్నించసాగింది కళ్యాణి. ఈ కలవారిబిడ్డ తండ్రి బ్రతికుండగాకూడా అనేకసార్లు ఇటువంటి ఉద్దండపనులేచేయ సమకట్టింది. కాని గంభీరుడు సంశయచిత్తుడైన శేఖరుని కోప భయంవల్ల ఏమీ చేయలేకపోయింది. కాని ఇవ్వాళ ఆమె స్వతంత్రురాలు. ఒక్కసారి స్వయంరాజా స్వయంప్రజా అయిపోయింది. ఆమె ఇంకెవరికీ ఏమీ సమాధానం చెప్పనవసరంలేదు. అతని ఆ ఒక్క మాటను పట్టుకొని ఆమె మనసులో అనేకం వూహించుకుంది. కాని ఏనాడూ తన హృదయాంతరాళంలోని గుప్తగుహాద్వారాలను తెరచిచూడ లేకపోయింది. ప్రయత్నిస్తే చూడగలిగేదే. కాని ఇంతకాలం నుండీ తన్నుతాను మోసపుచ్చుకుంటూ వచ్చింది. ఆఏకాంత గృహంలో ఇద్దరూ ఎదురు బదురుగా కూర్చుని వున్నారు. ఇద్దరికళ్ళవెంట కన్నీటిధారలు కారుతున్నాయి.

తన జీవితంలో ఈ ఏకాంతకరుణ దృశ్యం ఆమె మనో నేత్రాలకు అగోచరం కాబట్టే ఈమధ్య ఆమె ఇంట అనేక వుత్సవరాత్రుల నిప్పుల అభినయం జరిగినప్పటికీ ప్రరాజయాభి మానం వాటిని ఘంటకలువలేదు.

కాని ఇవ్వాల్టిరోజు అలా ఎందుకు గడవటం లేదో చెప్పాలి.

పుట్టినరోజు పండుగకు ప్రతిఏటా ఆమెయింట విందులు వినోదాలు జరుగుతూవుంటాయి. ఈయేడు ఆవుత్సవాలే మంచి ఆడంబరంగా జరుగుతూవున్నాయి. దాసదాసీలు మొదలుకొని ఇరుగుపొరుగు అందరూ వచ్చి దానిలో ఆనందంగా పాల్గొం

టున్నారు. కాని ఆమెమనసు ఏపనిలోనూ లగ్నం కావటం లేదు. పొద్దుటినుండీ ఆమె మనసులో ఇదంతా వృధా ఇదంతా వృధా పరిశ్రమ అని పిస్తూవుంది. ఇంతకాలం నుండీ ఆమె 'అతను కూడా లోకంలో మనుష్యులాంటి వాడే, అతను కూడా క్రోధ ఈర్ష్యలకు అతీతు డేమీకాదు' అనుకునేది. ఆమె ఇంటజరుగుతున్న ఈ ఆనందోత్సవపు పెద్దపెద్ద నూతన ఏర్పాట్ల విషయం అతని నిర్జన గృహంలోనికి చేరి యుండదా అది అతని మనసికి బాధకలిగించటం లేదా? అనుకున్నది.

అతను తూలికనవతలపారవైచి కూర్చునైనావుంటాడు లేకపోతే వికలిత మనస్కుడై ఇల్లంతా కలదిరుగుతునైనా వుంటాడు. నిద్రాహీనమైన తప్తశయ్యామీద పరుండి రాత్రి తెల్లవార్లు మాడి మసైపోతునైనా వుంటాడు... అథవా... సరే ఆసంగతులన్నీ పోని.

కళ్యాణి కల్పనలలోనే ఇంతకాలమునుండీ ఒకవిధమైన ఆనందానను భవిస్తూ వచ్చింది. ఆగస్మాత్తుగా - ఇవ్వాళ ఆమెకు ఏమీ లేదనిపించింది. ఏమీ లేదు. అతనికిఏపనిలోనూ ఏబాధా కలుగలేదు. అంతా అబద్ధం, అంతా మోసం! అతను పట్టుకోనూ కోరటం లేదు, పట్టుపడనూ తలచటం లేదు, ఈ దుర్బల శరీరం అగస్మాత్తుగా పర్వతంలాగ కఠినమూ, అచలమూ ఎలాఅయిందో తెలియదు. ఏతుపానుకూ దాని కాస్తకదిల్చే సామర్థ్యం కూడా లేదు.

అయినా పుష్యరోజు పండుగకు వుత్సవ ఏర్పాట్లు ఆనందంగానే జరుగుతూన్నాయి. దయాకరుడు ఇవ్వాళ అన్ని పనులలోనూ ముఖ్యుడైపోయాడు. అతడు పరిచయులతో

ఈమనిషే ఒకనాడు ఈ ఇంటి యజమానౌతాడు- ఆరోజు ఇం కెప్పుడవ దూరానకూడా లేదు అని గుసగుసలుకూడా ప్రారం భించారు.

ఇల్లంతా వూళ్ళో స్త్రీ పురుషులతో నిండివుంది. నలు వైపులా ఆనందకలరవాలు వినపడుతున్నాయి. ఎవరికోసం ఇవ న్నీ జరుగుతున్నాయో ఆమె అన్యమనస్కురాలైవుంది. ఆమె మొహాన విచారఛాయలు ఆవరించి వున్నాయి కాని ఆఛాయలు బైటవారికెవరికీకనబడవు. కనపడితే ఒకరిద్దరు పాత నౌకర్లుకూ, పరోక్షంలో వుండి అంతాచూస్తూవున్న మరొక వ్యక్తికీ కనపడతాయి. ప్రతిఏటా ఈపుట్టినరోజుపండుగకు అంద రికంటే ముందుగావచ్చి ఆశీర్వాదించి మాలవేసిపోయే వ్యక్తి ఇవ్వాళ లేడు. ఆ మాలా లేదు. ఆ ఆశీర్వాదము లేదు.

కళ్యాణి తండ్రికాలపు వృద్ధనౌకరు ఒకడు వచ్చి "ఇవ్వాళవారు ఎక్కడాకనపడటం లేదేం చిన్నమ్మా?" అన్నాడు.

వృద్ధుడు కొంతకాలం కిందట నౌకరీ మానేసివెళ్లి పోయాడు. ఈమనస్పర్ధల సంగతి అతనికి తెలియదు. ఇవ్వాళ ఇక్కడికి వచ్చినతర్వాతనే నౌకర్ల ద్వారా తెలిసింది. కళ్యాణి వుద్దండభావంతో "చూడాలని వుంటే అక్కడికి వెళ్ళక పోయి నావా! ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అన్నది.

"మంచిదే. వెళుతున్నాను" అని వృద్ధుడు వెళ్ళి పోయాడు. వెళుతూ వెళుతూ "వారొక్కర్నే చూస్తేచాలదు మీ యిద్దరినీ ఒక్కచోట చూడాలి. లేకపోతే ఇక్కడికి రావ డం ఎందుకు?" అనిగొణుక్కున్నాడు.

వృద్ధుని మాటలు తరుణికి తెలియకపోలేదు. అప్పటి నుంచే ఒకవిధమైన చకితావస్థతో పన్నులన్నీ నిర్వర్తించు కుంటూవుంది. హఠాత్తుగా ఆమె ఒక అస్పష్ట స్వరం విని తలెత్తి చూచేప్పటికి శేఖరు నుంచుని వున్నాడు. ఆమె శరీరమంతటా మెరపులు పరుగు లెత్తినాయి. నిమిషంలో మళ్లాతమాయించు కొని - మొహం తిప్పుకొని మరో గదిలోనికి వెళ్ళిపోయింది. కొంచెం సేపటికి వృద్ధుడు వచ్చి" ఏమైనా శేఖర్ నీ అతిథి అతన్ని పలకరించను కూడా పలకరించగూడ దా చిన్నమ్మా?" అన్నాడు.

"నేను నిన్ను పిలుచుకు రమ్మనమని చెప్పలేదే"

"అదే నా తప్పు?" అని అతను వెళ్ళబోతూ వుండే ప్పటికి కళ్యాణి పిలచి "నేను కాక ఈ ఇంట్లో ఇంకా చాలమంది వున్నారుగా వారు మాట్లాడ వచ్చుగా!" అన్నది.

"ఆఁ మాట్లాడవచ్చు కాని ఇప్పుడు ఆ అవసరంకూడా లేదు. వారు వెళ్ళిపోయారు" అన్నాడు వృద్ధుడు.

కళ్యాణి స్తబ్ధురాలై వుండిపోయింది "నారాత. భోజనం చేసి వెళ్ళమని నువ్వయినా చెప్పవచ్చుగా?" అన్నది.

"లేదు నేనంత సిగ్గుమాలినవాణ్ణికాదు" అని వృద్ధుడు కోపంతో వెళ్లిపోయాడు,

౭

ఈ అవమానానికి శేఖర్ కళ్లల్లో నీళ్లుతిరిగాయి. కాని అతను ఎవరితప్పు ఎంచలేదు. మాటిమాటికీ తన్ను తాను నిం దించుకొంటూ "తగినశాస్తి జరిగింది. నాలాంటి సిగ్గుమాలిన మనిషికి ఇంతమాత్రం అవసరం" అనుకోసాగాడు,

కాని ఈ అవసరం ఇక్కడే ఈ ఒక్కరాత్రిలోనే అంతంకాలేదు. అంతకంటేకూడా ఎక్కువ అవమానం అతని నొసటరాసివుందని రెండుమూడురోజుల తర్వాత తెలిసింది. ఆ అవమానాన్ని అతను జీవిత పర్యంతం ఎక్కడ దాచిపెట్టు కుంటాడు? దానికి దరీ దాపూ ఏమీకనపడటం లేదు.

మనము ఏచిత్రాన్నితీసుకొని ఈకథప్రారంభించామో ఆ జాతకకథాంశంలోని గొప్పచిత్రం ఇన్నాళ్ళకు ఇప్పుడుసంపూర్తయింది. నెలరోజుల నిరంతర పరిశ్రమ ఫలితముఇవ్వాళ....

ఈ ఆనందంలో అతను హృదయమంతాగడిపాడు.

చిత్రం రాజదర్బారుకు వెళుతుంది. ఖరీదిచ్చి తీసుకొని వెళ్ళేవ్యక్తి ఈ కబురువిని వచ్చాడు. చిత్రం మీాది పరదాతీయగానే అతను చూచి చకితుడై పోయాడు. చిత్రకళవిషయంలో అతను అజ్ఞాను డేమికాడు. చాలసేపటివరకు తదేకధ్యానంతో చూచినతర్వాత చివరకి "నేనీచిత్రాన్ని రాజుగారికి తీసుకెళ్ళలేను" అన్నాడు.

భయవిస్మయాలతో హతబుద్ధుడై శేఖర్ "ఎందుకని?" అన్నాడు.

"కారణం-నేనీ మొహాన్నిగుర్తించగలను. మానవలక్షణాలతో దేవతలచిత్రాల్నిచిత్రిస్తే వారికి కీడుకలుగుతుందన్న సంగతి రాజుగారికి తెలిస్తే నా మొహం కూడాచూడరు!"

అని అతను కొంచెంసేపు చిత్రకారుని వ్యాకులిత నేత్రాలకేసి చూచి చిరునవ్వుతో "కొంచెం ధ్యానముంచి చూస్తే నీకే కనపడుతుంది - ఎవరో? ఈ చిత్రం చలామణీ కాదు" అన్నాడు.

శేఖర్ కళ్లమీద నుండిమెల్లమెల్లగా మబ్బుతెరలు విడి పోయినట్లయింది. ఆరాజ దూత అక్కడనుంచి వెళ్లిపోయిన తర్వాత కూడా అతను ఆవైపే చూస్తూవుండిపోయాడు. అతని కళ్ళవెంట కన్నీరు కారసాగినై. ఇంత పరిశ్రమచేసి తనఅంతర్యంలో అంకితం చేసుకున్న సౌందర్యం ఆజాతక కథలోని గోపిదికాదు కళ్యాణిది.

కళ్లుతుడుచు కుంటూ అతను మనసులో "భగవంతుడా! నువ్వు నాకీవిధంగా వియోగం కలిగించావు - నేను నీకేం అపరాధం చేశాను!" అన్నాడు.

౮

దయాకరుడు సాహసించి "నీయందు దేవతలకు కూడా మక్కువవున్నట్టువుంది. కాని నేను మానవమాత్రుణ్ణి కళ్యాణీ" అన్నాడు.

కళ్యాణి అన్యమనస్కురాలై "అందనిది దేవతలకు కూడా అతీతమైనదిగా కనపడుతుంది" అన్నది.

కాని ఆమె ఈప్రసంగాన్ని ముందుకు సాగిపోనియ్యలేదు "కోర్టులో నీకు మంచి పలుకుబడి వుందని విన్నాను. నాకొక పనిచేసిపెట్టగలవా? చాల తొందరగా?" అన్నది.

"ఏంపని?" దయాకరుడు చాల వుత్సుకతతో అడిగాడు.

"ఒక మనిషికి నేను చాలా డబ్బుయిచ్చాను. కాని నేను అతని దగ్గర నుంచి వసూలు చేయలేక పోతున్నాను. దానికి దస్తావేజులుగాని నోట్లుగానీ ఏమీ లేవు. నువ్వు దానికేమైనా వుపాయుం ఆలోచించగలవా?"

"తప్పక! నేను రాజకర్మచారి నన్నుసంగతి నీకు తెలియదా ఏమిటి?" అని అతను నవ్వాడు.

ఈ నవ్వులోనే స్పష్టమైన సమాధానముంది. కళ్యాణి ఆతురతతో అతనిచేయిపట్టుకొని "అయితే ఏదైనా వుపాయం చూడు ఇవ్వాళే నేను ఇక ఒక్కరోజుకూడా ఆలస్యంచేయ దలచుకోలేదు." అన్నది.

దయాకరుడు తలవూగించి "సరే చేస్తాను"అన్నాడు.

ఈ ఋణంతుచ్ఛమైనదీ, అసంభవమైనదీ. హాస్యాస్పదమైనదీని. దానిగురించి ఎవరూవూహించనుకూడా వూహించలేదు. కాని, రాజకర్మచారిమాట ఆశతో కళ్యాణి వళ్లంతా క్షణంలో వుత్తప్తమైపోయింది. ఆమెతనరెండు కళ్లూపెద్దవిచేసి అతని చరిత్ర సంతా వినిపించి "నేను ఏమీవదిలి పెట్టను. ఒక్క చిల్లిగవ్వకూడా వదిలి పెట్టను. జలగ రక్తం ...చినట్టు ఇవ్వాళే - ఇప్పుడే... ...?" అన్నది.

ఈవిషయంలో ఆమనుష్యునికి ఎక్కువగాచెప్పనవసరం లేదు. ఇదిఅతని ఆశకంటే కూడా ఎక్కువగా వుంది. అతను తన అంతర్యంలో ఆనందాన్ని ఆగ్రహాన్ని ఏదో విధంగాఆపుకొని "ప్రభుత్వపులా కనీసం ఏడురోజులుగడువు అడుగుతుంది. అంత వరకు ఏదో విధంగా ధైర్యంగా వుండాలి. ఆతర్వాత నీ యిష్టమొచ్చినట్లు ఎంత పీల్చినా నే నేంకాదనను" అన్నాడు.

"సరే, మీరు ఇకఇక్కడినుంచి వెళ్ళండి" అని ఆమె ఒకవిధంగా తప్పించుకు పారి పోయింది.

ఈ అజ్ఞానతరుణియందు అతని ఆసక్తికి అంతులేదు. అందుచేత ఆమెవ్యంగ్యోక్తు లనేకం అతను మొదలకుండా హరిం

చుకు వూరుకున్నాడు. ఇవ్వాళకూడా అతను అలాగే చేశాడు కాని, ఇంటికి తిరిగివెళ్ళబోయేటప్పుడు దారిలో అతను ఆనందోత్సాహంలో ఇంకేం భయం లేదు. నామార్గం నిష్కంటకం కావటానికి ఇంకెక్కువ కాలం పట్టనట్టువుంది. ఆలస్యంకాని మాటమాత్రంనిజం. ఎంతత్వరగా భగవంతుడు అతనిరాతలో ఎంతవింతంగా మార్చాడు, దాన్ని, వూహించటానికికూడా అతనికి ఇవ్వాళ అసంభవము.

౯

దావా సమన్సువచ్చాయి. వాటినిచేతపట్టుకొని శేఖర్ చాలసేపటివరకు మెదలకుండా కూర్చుని వుండిపోయాడు. ఇది చూచి అతనికి ఆశ్చర్యంకూడా కలుగలేదు. గడువు తక్కువ వుంది త్వరలో ఏదైనా చెయ్యాలి.

ఎప్పుడో ఒకరోజున కళ్యాణి కోపంతో అతని తండ్రి దుబారాఖర్చును గురించి కటూక్తులాడింది. ఈ అపరాధాన్ని అతను మరచిపోలేదు. దీనికతను క్షమించలేదుకూడా. అందుచేత ఇప్పుడతను ఆమెను గడువు యాచించి వారిని మరింత అవమానంచేద్దామనీకాదు. తనసర్వస్వం యిచ్చినా తండ్రి రుణం తీరుతుందా లేదా అనే_అతని చింత.

ఆవూళ్ళోనే ఒక ధనవంతుడున్నాడు. మర్నాడు వుదయానే అతనిదగ్గరకువెళ్ళి రహస్యంగా తనఆస్తి పాస్తులన్నీ బేరంపెట్టాడు. అతను యిచ్చేదానితో రుణం తీరిపోతుందనుకున్నాడు.

డబ్బుతీసుకొని అతను యింటికి వచ్చాడు. ఒక వ్యక్తి హృదయహీనత అతని శరీరానికి మనసుకీ ఎంత ఆఘాతం

కలిగించిందీ అతనికి జ్వరం వచ్చేప్పటికి ఇప్పుడు గ్రహించ కలిగాడు.

రాత్రింపగళ్ళు ఎలాగడచిపోతున్నాయోకూడా అతనికిస్పృహ లేదు. అతనికి తెలివివచ్చి చూచేప్పటికి- ఆరోజునే అతని గడువుకు చివరరోజని తెలుసుకున్నాడు.

ఇవ్వాళ చివరిరోజు. తన ఏకాంత గృహంలోకూర్చుని కళ్యాణి వ్యూహా సౌధాల నిర్మించుతూవుంది. ఆమె అహం కారం వదులుతూ మరోవ్యక్తి అహంకారాన్ని మిన్న ముట్టించింది. ఆ అహంకారము ఇవ్వాళ ఆమెపాదాలమీద పడి మట్టిపాలై పోతుంది. దానితో ఏమాత్రము సందేహంలేదు. ఇంతలో నౌకరు వచ్చి కింద శేఖర్ మీకోసం ఎదురుచూస్తున్నాడని చెప్పాడు. కళ్యాణి లోలోన కుమపునవ్వునవ్వి "తెలుసు" అన్నది. ఆమెకూడా అతనికోసమే ఎదురు చూస్తూవుంది,

కళ్యాణికిందకు రాగానే శేఖర్ లేచి నుంచున్నాడు. అతని మొహం చూడగానే కళ్యాణి గుండెల్లో రాయిపడి పోయింది: ఆమె డబ్బుకోరటంలేదు. డబ్బుయందు ఆమెకు ఏమాత్రమూ లాలసలేదు కాని ఈడబ్బుపేరుతో ఎంత భయంకర అత్యాచారాలను చేయవచ్చునో ఆమె ఇవ్వాళ స్వయంగా చూచింది. శేఖరే మొదట మాట్లాడించాడు. "వాయిదా చివరిరోజు ఇవ్వాళే. మీడబ్బు తీసుకువచ్చాను" అన్నాడు.

ఓరి మానవుడా! చస్తున్నా గర్వం వదలిపెట్టవు! లేక పోతే కళ్యాణి నోటివెంట ఈమాటలు ఎలావచ్చేవి "నాకు

కొద్దిడబ్బు అవసరంలేదు. నేను రుణమొత్తమంతా తీర్చాలని చెప్పాను'' అన్నది,

శేఖర్ శుష్కవదనం మీాదికి చిరునవ్వుతెచ్చి పెట్టుకొని "మీారన్నది నిజమే! మొత్తమంతా తీసుకొచ్చాను" అన్నాడు.

"మొత్తమంతానా? ఎక్కడినుంచి తెచ్చావు?"

"రేపు తెలుస్తుంది. పెట్టెలో పైకం పెట్టివుంది. ఎవరి నైనా తీసుకోమని చెప్పండి"

బండివాడు వాకిటబైటనుండిఅతన్నివుద్దేశించి"ఇంకెంత సేపు పడుతుందిబాబుగారూ? ఎక్కువఆలస్యమైందంటే రాత్రి పేశూలో ఆగటానికి ఎక్కడా చోటుకూడా దొరుకదు'' అన్నాడు.

కళ్యాణి వాకిట్లోంచి చూచింది. వాకిట్లో-పెట్టె-పరుపు ఇంకా సామానుతో నున్నబండి నుంచునివుంది. భయంతో నిమిషంలో ఆమెమొహమంతా ఒక్కసారి వెలవెలపోయింది. వ్యాకులతతో ప్రశ్నమీాదప్రశ్న వెయ్యి ప్రశ్నలడిగింది. పేశూవెళుతున్నది ఎందుకు? బండిఎవరిదీ? ఇంతడబ్బుఎక్కడి నుంచి తీసుకొచ్చావు? మాట్లాడవేం? రేపుతెలిసేది ఏమిటి? ఇవ్వాళ మాట్లాడుతూవుంటేనే......?

అంటూనే ఆమెతనకుతాను తెలియకుండానే అతని చేయిపట్టుకుంది. మళ్ళా నిమిషంలో చెయ్యివదలిపెట్టి అతని నొసటచెయ్యివేసి తృళ్లిపడి "అరే, జ్వరమువచ్చిందే. కాబట్టే అన్నాను-నీ మొహం ఇంత వాడిపోయిందెందుకని?'' అన్నది.

శేఖర్ వదిలించుకొని శాంతస్వరంతో "కూర్చో" అని అతనుకూడా కూర్చుని "నేను మాండలే వెళుతున్నాను. ఇవ్వాళ నువ్వు నా అంతిమ ప్రార్థన వింటావా?" అన్నాడు.

కళ్యాణి తలకాయవూగించి వింటాను అన్నది. శేఖర్ కొంచెం స్థిమితంగాకూర్చుని "తగినవరుణ్ణిచూచి వెంటనే వివాహం చేసుకోమని నా అంతిమకోర్కె. ఈవిధంగా అవివాహితావస్థలోఎక్కువకాలం గడపకు. ఇంకోమాట..." అని కొంచెంసేపటివరకు మౌనంగాకూర్చుని ఈసారి మరింత మృదుస్వరంలో "ఈమాట జీవిత సర్వస్వం జ్ఞాపకం పెట్టుకో మని చెబుతున్నాను. లజ్జలాగనే అభిమానంగూడా స్త్రీలకు భూషణం; అన్నమాట ఎప్పుడూ మరచిపోకు. కాని—అతి అయితే......" అన్నాడు.

కళ్యాణి అధైర్యంతో "అదంతా ఇంకెప్పుడైనా వింటాను. డబ్బు నువ్వు ఎక్కడినుంచి తెచ్చావో అదిచెప్పు" అన్నది మధ్యలోనే.

శేఖర్ నవ్వాడు "ఆసంగతి ఎందుకు అడుగుతున్నావూ నీకు తెలియని సంగతులేమున్నాయి నాకు?" అన్నాడు.

"డబ్బు నువ్వు ఎక్కడినుంచి తీసుకొచ్చావు?"

శేఖర్ గుటకలుమింగి చివరికి "తండ్రిగారి రుణం వారి ఆస్తితోనే తీర్చాను. లేకపోతే నాకు స్వంతమనేది ఇంకే ముంది?" అన్నాడు.

"నీపూలతోట?"

"అదీ తండ్రిగారిదేగా"

"నీ ఆపుస్తకాలన్నీ?"

"ఇప్పుడు ఆపుస్తకాలతో ఏమిచేయను. అదీ గాక అవీ తండ్రిగారివేగా"

కళ్యాణి ఒకనిట్టూర్పు విడచి "పోనీ, మంచిపని చేశావు! ఇక పైకి వెళ్ళి పండుకో పద" అన్నది.

"ఇవ్వాళనేను వెళ్లాలి"

"ఈ జ్వరంతోనా? నేను నిన్నీ స్థితిలో వదిలి పెడతా వని నిజంగా నమ్మకముందా?"

అని ఆమెదగ్గరకు వెళ్ళి చెయ్యి పట్టుకుంది. ఈసారి శేఖర్ ఆశ్చర్యంతో చూచాడు. కళ్యాణి మొహం ఒక్క నిమిషంలో మారిపోయింది. ఆమె మొహంమీద విషాద విర్వేదాల లజ్జాభిమానాల చిహ్నాలు లేశమాత్రంకూడా కనపడ లేదు. ప్రగాఢప్రేమ మాత్రంవున్నది. ఆ మొహం అతన్నొక్కసారి మంత్రముగ్ధుని చేసింది. అతను మెదలకుండా మెల్లగా పై పడకగదిలోకి వెళ్లాడు.

అతన్ని పక్కమీద పండబెట్టి కళ్యాణి పక్కను కూర్చున్నది. సజలనేత్రాలతో అతని మొహంలోకి చూస్తూ "డబ్బుతీసుకువచ్చాను. రుణంతీరుతుందనుకున్నావా? మూండలే వెళ్ళే ప్రయత్నం వదలిపెట్టు. నా అనుజ్ఞ లేనిదే ఈఇంట్లోంచి బైటకు అడుగుపెట్టావంటే - నేను ఈమేడమీద నుంచి కిందకుదూకి చస్తాను-నువ్వు నన్ను చాల దుఃఖపెట్టావు. నేనే నా దుఃఖాన్ని సహించలేనని గట్టిగా చెబుతున్నాను" అన్నది.

శేఖర్ ఏమీ మాట్లాడలేదు. ఒక నిట్టూర్పు విడచి వత్తిగిలి పండుకున్నాడు.

# విలాసి

సరిగ్గా రెండుకోసులదూరంవడచి స్కూలుకు వెళుతూ వుండేవాణ్ణి, విద్యనార్జించటం కోసమని. నేనొక్కణ్ణేకాదు ఇంకా పది పన్నెండు మంది పిల్లలున్నారు. పల్లెటూరి వాసులలో నూటికి తొంభై మంది పిల్లలు ఈవిధంగానే విద్యనార్జించవలసి వచ్చేది. చివరికి దీనిలోని లాభస్థానం పూర్తిగా శూన్యమైనప్పటికీ వున్నదానిని లెక్కవెయ్యటానికే ఈవిషయాలను గురించి ఆలోచించటం అవసరం.

ఆపిల్లలు పొద్దున్నే ఎనిమిది గంటలుకాకముందే - భోంచేసి ఇంటినుండి బైలు దేరినది మొదలు రెండుకోసులు పోవటం రెండుకోసులురావటం - మొత్తం నాలుగు కోసులు నడవవలసి వచ్చేది. నాలుగుకోసులంటే ఎనిమిది మైళ్లేకాదు అంతకంటేకూడా చాలఎక్కువ. వర్షకాలంలో నెత్తిన దినుసులు, కింద మోకాళ్ళలోతున బురదా, వేసవిలో చినుకులకు బదులు ఎండా, బురదకుబదులు దుమ్మూనా పడి అసులోగొట్టం లాగ ఇంటికీ, స్కూలుకీ వస్తూవుండాలి. ఈ నిర్భాగ్యబాలకుల యందు సరస్వతీదేవి కరుణించి వరమిస్తుందో వారికష్టం చూచి - మొహం చాటేస్తుందో - ఇదిస్వయంగా ఆమెకూడా వూహించలేదు.

ఆతర్వాత - విద్యాలాభం పొందిన పిల్లలు పెద్దవాణ్ణే పల్లెల్లోవున్నా, క్షుద్బాధ తీర్చుకోటానికి పొట్టకట్టుకొని మరెక్కడికి వెళ్ళినా, వారి నాలుగు కోసుల నడక - విద్యలో చురుకుదనమూ, ఆత్మశుద్ధి కలిగించకుండా వుండదు. కలిగి

స్తుందికూడా. క్షుధాగ్నివున్నవాళ్ళ సంగతి అలావదలిపెట్టి, ఆబాధ లేని పెద్దమనుష్యులంతా ఏం సుఖం కోసం పల్లెలొదిలి పారిపోతున్నారు? వాళ్ళుఅక్కడే వుంటేపల్లెటూళ్ళకుఇలాంటి దుస్థితి పట్టదుగదా !

నేను మలేరియా విషయం ఎత్తటంలేదు. దాన్నిఅలా వుంచుకొని ఈ నాలుగుకోసుల దూరం నడవాలనేభయంలో ఎన్ని కుటుంబాలు పిల్లాజెల్లాను తీసుకొని పల్లెలొదలి పట్టణా లకు పారిపోయి వచ్చారో ఏమైనా లెక్కవుందా! తర్వాత ఒకరోజున చదువు సంధ్యలు అయిపోయినా పట్టణపు సుఖ భోగాలను వదలిపెట్టి వెళ్లటానికి వారికి బుద్ధిపుట్టదు.

అయితేపోనీ, ఆ అనవసరపు మాటలనన్నిటినీ నేను స్కూలుకు వెళుతూవుండేవాణ్ణి. ఈరెండుకోసులమధ్య రెండు మూడు వూళ్ళుదాటి పోవలసి వచ్చేది. దారిలోఎవరితోటలో మామిడికాయలు పండటం ప్రారంభమైందో, ఎవరిచెట్టు పనసకాయ పండివుందో, ఎవరి అరటిగెల కొట్టబోతున్నారో, ఎవరింటి ముందు అనన్నాసకాయ రంగువస్తూవుందో, ఎవరి చెరువు గట్టున ఖర్జూరగెల్లలు కొట్టుకొస్తే పట్టుకుంటారన్న భయం తక్కువగా వుంటుందో, ఈ సంగతులు తెలుసుకోవ టంతోనే మాకాలమంతాగడచిపోయేది. కాని అసలు చదు వులు - స్కాట్లండు రాజధానిపేరేమిటి? సైబీరియాగనులలో దొరికేది వెండా? బంగారమా-? ఈ అవసర విషయాలు తెలుసుకోటానికి మాకు తీరికే వుండేదికాదు.

ఏడెన్ ఏమిటంటే - పర్షియారేవుపట్టణమని జబాబు చెప్పటానికీ హుమాయూన్ తండి) పేరడిగితే తుగలక్ ఖాం

అని వ్రాసిరావటానికీ ఇదే కారణం. ఇవ్వాళనాకు నల్లై య్యేపడి దాటిపోతున్నప్పటికీ వాటి ధోరణి అలాగేవున్నట్టు కనపడుతూవుంది. తర్వాత పెద్ద క్లాసులో వేసే రోజున మొహం మాడ్చుకొని ఇంటికి వచ్చేవాళ్ళం. ఒక్కొక్కనాడు పిల్లల మంతా ఏకమై మాష్టర్ని సంస్కరించాలనుకునేవాళ్లం. ఒక్కొక్కరోజున ఈదగుల్బాజీ స్కూలు వదిలి పెట్టటమే మంచి దనుకొనేవాళ్ళం.

మేము స్కూలుకు వెళుతూవుండగా దారిలో అప్పు డప్పుడూ ఒకకుర్రవాడు కలుస్తూవుండేవాడు. పేరు మృత్యుం జయుడు. మాకంటె కొంచెం జబరుగావుండేవాడు. థర్డుఫారం చదువుతూవుండేవాడు. అతను థర్డుఫారంలో ఎప్పుడు చేరా డో ఆసంగతి మాకెవరికీ తెలియదు. ముందు ముందు బహుశా ఇది పురాతత్వవేత్తలకు గవేషణ విషయమౌతుందేమో నని సంశయం. కాని మేమున్నంతకాలం మాత్రం ఎప్పుడూ థర్డుఫారంలోనే చూస్తూవుండేవాళ్ళం, అతను ఫోర్తుఫారం చదువుతూవున్నట్టు ఎప్పుడూ వినలేదు. మళ్లా సెకండుఫారా నికి వచ్చిన సంగతి తెలియదు. మృత్యుంజయునికి అన్నదమ్ము లుగానీ, తల్లిదండ్రులుగానీ ఎవరూ లేరు. వూళ్ళో ఒకపక్కని పెద్దమామిడితోట- దానిలో ఒక పాడయిన కొంపావున్నది. వరుసకు పినతండ్రియైన ఒక దూరపుబంధువు మాత్రం వుం టూండేవాడు. అతను చేయతగిన పని ఒక్కటే- గంజాయి తాగుతాడు, సారాయితాగుతాడు -...ఇంకేదేదో...అని అన్నకొడుకు మీద రకరకాలైన అపవాదుకలు వేస్తూ తిరగ టం. అతనికి మరొకపనికూడావుంది - ఆతోటలో సగభాగం

తనదేననీ, దావావేసి స్వాధీనంచేసుకోవటమే తడవు అనీ— వాగుతూ తిరగటం! ఆ, ఒకరోజున అది అతని స్వాధీనమైంది. జిల్లాకోర్టు ద్వారానుకాదు ఇంకా ఆ స్త్రీకోర్టుద్వారానూకాదు. పోనీ ఆసంగతి మరొకసారి చెబుతాను.

మృత్యుంజయుడు స్వయంగా తనచేత్తో నందుకు తింటాడు. పండ్లకాల ముచ్చిన తర్వాత తోట నెవరికైనా యిజారాకిచ్చి - ఆడబ్బులో సంవత్సరానికి సరిపడ తిండి బట్ట కొనుక్కునేవాడు. బాగానే సరిపోయేది. కాని ఎప్పుడుచూచినా అతను చిరుగుల గుడ్డలతో-మాసిపోయిన పుస్తకాలనుచంకను పెట్టుకొని-రోడ్డుపక్కగా వదిగివదిగిపోతూవుండేవాడు. అతన్ని ఎప్పుడూ ఎవరూ పలకరించగా చూడలేదు. కాని మేము మాత్రం పరిహాసంగా అతనిదగ్గరకెళ్ళి మాట్లాడిస్తూవుండే వాళ్ళం. దానికి ముఖ్యకారణం వూళ్ళో అతనితోపాటు మిఠాయిఇంకెవరూ కొనిపెట్టేవాళ్ళుకాదు. కేవలం పిల్లలకే కాదు. ఎంతమంది పిల్లల తండ్రులు ఎన్నిసార్లు రహస్యంగా తమపిల్లల్ని పంపించి స్కూలుఫీజుపోయింది, పుస్తకాలు చిరిగి పోయినాయి అని అడిగించి డబ్బు పట్టుక్కుంటూవుండేవారో అంతులేదు. దానికి కృతజ్ఞత చూపించటం అటుంచి— బైట తమపిల్లలు అతనితో మాట్లాడినట్టు చెప్పటానికి కూడా ఎవరూ ఇష్టపడరు. మృత్యుంజయునికి వూళ్లో అలాంటి మంచిపేరే వుంది.

చాలరోజుల వరకు మృత్యుంజయుడు కనపడలేదు. ఒకరోజున-అతను చావు మంచంమీద వున్నాడనీ, ఒకపాము లవాడూ, వాడి కూతురూ అతనికి వైద్యంచేసి, సేవచేసి

బ్రితికించారని విన్నాను. చాలరోజులు నేను అతని మిఠాయి చాలా సద్వినియోగంచేశాను. నామనస్సు అతనికోసం ఎలా ఎలా అయిపోయిందో తెలియదు. ఒకరోజున సంధ్యచీకట్లో రహస్యంగా నేను అతనిపూరికొంపచుట్టూ ప్రిహారీ గోళ్ళేమీ లేవు. తలుపు తీసేవుంది. తిన్నగాలోపలికి వెళ్ళిచూచాను. మృత్యుంజయుడు – తెల్లటి పరుపుమీద పడుకొనివున్నాడు. అతని వంకచూడగానే యమరాజు తన ప్రియుత్నాల్లో వేటినీ కొరతవుంచ లేదనిపిస్తూవుంది. కాని అవేమీ ఫలించ లేదు. ఇదంతా ఆపిల్ల పట్టువల్ల నెగ్గింది. ఆమె తలవైపున కూర్చుని పంకా విసురుతూవుంది. మనిషి రావటంచూచి హఠాత్తుగా త్రుళ్ళిపడి లేచి నుంచున్నది. ఆమె, ఆ ముసలి పాములవాని కూతురు విలాసి. ఆమెవయుసు పధ్దెనిమిదో - ఇరవై ఎనిమిదో కనుక్కోవటం కష్టం కాని ఆమె మొహంవంక చూడ గానే వయస్సెంత వున్నా - అధిక పరిశ్రమవల్లా, రాత్రిం పగళ్ళు మేలుకొని వుంటటంవల్లా - ఆమె శరీరం కృశించి పోయిందని తెలుస్తూవుంది. బానేఫలంలాగ కాస్త కదిలించ గానే కాస్త ముట్టుకోగానే ముడుచుకు పోతుంది.

మృత్యుంజయుడు నన్నుగుర్తించి "ఎవరు? నేడా ? అన్నాడు.

"అవును" అన్నాను నేను.

"కూర్చో"' అన్నాడు మృత్యుంజయుడు.

విలాసి తలవంచుకు నుంచున్నది. మృత్యుంజయుడు-- రెండు మూడునెలలబట్టీ మంచంమీదే పడివున్నాననీ, మరీ పది పదిహేనురోజులు స్పృహ లేదనీ, నాలుగైదురోజులనుండి

మాత్రం మనుష్యుల్ని గుర్తుపడుతున్నాననీ, ఇంకా మంచం వదిలి బైటికి రాగలస్థితిలో రాలేనుగాని ఇక భయపడవలసిం దేదో క్లుప్తంగా రెండు మాటలలో చెప్పాడు.

భయపడవలసిందేమీ లేదు. చిన్నవాణ్ణయినా మంచం మీదనుండి లేవలేని స్థితిలోనున్న రోగికి అడవిలో ఒంటరిగా వుండి బ్రతికించే భారం వహించటం ఎంతగురు భారమో తెలుసుకున్నాను. రాత్రులకు రాత్రులు - పగళ్ళకు పగళ్ళు ఆమె చేసిన - సేవకూ శుశ్రూషకూ ఏమైనా అంతువుందా? ఇది ఎంత సాహసం గలపని !

కాని ఈ అసాధ్య సాధనను సంభవంచేసిన వస్తువును గురించి ఆరోజున తెలియలేదు. కాని మరొకరోజున తెలిసింది.

తిరిగి వచ్చేప్పుడు - ఆపిల్ల ఒకదీవం చేతపట్టుకొని - పడిపోయిన గోడవరకు వచ్చింది. ఇంతవరకు ఆమె ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఇప్పుడు ఆమె మెల్లగా "డొంక వరకు పంపించేదా?" అన్నది.

పెద్దపెద్ద మామిడిచెట్లతో తోటంతా అంధకారంగా వుంది. దారికనపడటం లేదు సరిగదా - చేయికి చేయికూడా కనపడటం లేదు "పంపించ నవసరం లేదు. దీపం మట్టుకు యివ్వు" అన్నాను.

దీపం నా చేతికివ్వగానే - ఆమె వుత్కంఠిత వదనం మీంద నాదృష్టి పడింది "వంటరిగా వెళ్ళటానికి భయమేస్తుం దేమో ! ఇంకొంత దూరం పంపిద్దునా!" అన్నది మెల్లగా.

భయమేస్తుందేమోనని ఒక స్త్రీ అడిగింది కనుక-వున్నా లేకపోయినా సమాధానంగా 'లేదు' అనిముందుకు సాగాను.

"పురుగూ బుట్రా వుండేవి కాస్త చూచిపొండి" అన్నది మళ్ళా.

నాగుండె జల్లుమన్నది. ఆమెకు ఇంత అతురత దేనికో, దీపం చూపించి తోట దాటించుతానన్నది దేనికో నేనిప్పుడు గ్రహించాను. ఆ రోగిష్టి మృత్యుంజయుని వదిలి రావటానికి ఆమెకు ఇష్టం లేదు.

పదిపది హేనెకరాలతోట. డొంక తక్కవమూరా నేమీ లేదు. ఆకీటకారణ్యంలో అడుగడుగూ చూచివెయ్యవలసి వస్తోంది. మరుక్షణమే ఆపిల్లమాటలు జ్ఞాపకమొచ్చి వల్లంతా కంపించి పోయింది. మరణ శయ్యమీదనున్న రోగితో ఇక్కడవుండటం ఎంతకష్టమో ననిపించింది. ఏనిమిషానైనా మృత్యుంజయుడు చనిపోతే - రాత్రి తెల్లవార్లూ ఈపిల్ల ఒంటరిగా ఏమిచేస్తుంది? ఎలా గడుపుతుంది?

ఈసంగతి చెబుతూవుంటే - చాలకాలంనాటి విషయమొకటి నాకు జ్ఞాపకం వస్తూవుంది. మాబంధువొకరు చనిపోయాడు అప్పుడు నేనుకూడా అక్కడేవున్నాను. చీకటి రాత్రి—ఇంట్లో—జనశూన్యం— నేనూ అతని భార్యమాత్రం వున్నాం. ఆమె దుఃఖాతిరేకంతో గుండె,తలమోదుకుంటూ-తన ప్రాణంకూడా పోతుందా అన్నంత కాండచేసింది. ఆమె ఏడుస్తూ 'నా బుద్ధిపూర్వకంగా నేను సహగమనం చేసుకుంటే ప్రభుత్వానికేం? నాకు బ్రతికివుండాలన్నకోర్కె ఏమీ లేదు. ఈవిషయం సర్కారుమనుష్యులకు తెలియదా? వాళ్ళింట్లో స్త్రీలు లేరా? వాళ్ళ హృదయాలు రాతిహృదయాలా

ఈరాత్రి వెళ్ళి వూళ్ళో నలుగురూ ఏటిఒడ్డున నా సహగమన ఏర్పాట్లుచేస్తే స్టేషనువాళ్ళకెలా తెలుస్తుంది?—' అని మాటి మాటికీ అడుగసాగింది. ఆమె వాళ్లని ఇంకెన్ని మాటలన్నదో అంతులేదు. కాని నేను ఈఏడుపు వింటూ కూర్చుంటే కుదరదు. వూళ్ళోకి కబురుపంపటం అవసరం! చాలవస్తువులు పోగుచేయాలి-అని బైలుదేరబోయేప్పటికామె కళ్ళు తుడుచుకుని 'జరగవలసిందేదో జరిగిపోయింది. ఇప్పుడు బైటికి వెళ్ళి ఏం చేస్తావు? తెల్లవారనీ?' అన్నది.

"చాల పనివుంది. ఇక్కడ కూర్చుంటే కుదరదు" అన్నాను నేను.

"పనుల సంగతి అలావుంచి, ముందు నువ్వుకూర్చో" అన్నదిఆమె.

"కూర్చుంటే కుదరదు. వూళ్ళోకి కబురుచెయ్యాలి" అని నేను బైటికి వస్తూవుండేప్పటికి ఆమె ఒక్కసారి అరచి" "బాబో! నేనొక్కదాన్నే వుండలేను" అన్నది.

నేను మళ్లా తిరిగివచ్చి కూర్చోవలసి వచ్చింది. ప్రతి క్షణంగా ఏభయం లేకుండా పాతిక సంవత్సరాలు కాపురం చేసిన పతి మరణించినా సహించిందిగాని - అతని మృతకళే బరాన్ని చూచిఆచీకటిరాత్రిలోఅరక్షణనిమిషాలుకూడావుండ లేక పోయింది. పతి మృత కళేబరం దగ్గరకూర్చుంటే గుండెబద్దలై పోతుందేమో!

కాని నావుద్దేశం ఆమెదుఃఖాన్ని హేళన చెయ్యటం కాదు. అది హృదయపూర్వకమైనది కాదని కూడాకాదు. అలాంటిదే నాకు మరొక ఘటనకూడా జ్ఞాపకముంది. దానిని

వుల్లేఖించకుండానే - కేవలం కృతజ్ఞాన పరిభావం వల్లగానీ, చాల కాలంవరకు ఒకచోట కాపురం చేసినందువల్లగానీ ఏస్త్రీ - భయాన్ని దాటిపోలేదు. అదేనో మరొకశక్తి. దాని వల్ల చాలమంది స్త్రీపురుషులు వందేసి సంవత్సరాలు కాపురం చేసినా-ఏమీ అంతేవుండదు.

కాని తలవని తలంపుగా ఏస్త్రీ పురుషులకైనా ఆశక్తి పరిచయం ప్రాప్తమైతే సంఘన్యాయస్థానంలో జడ్జియై వారికి శిక్ష విధించ నవసరమైతేకానీ సమాజకంగాని మనుష్యవస్తు వేదైనా సరే స్వయంగా వారి దుఃఖంచూచికన్నీరు కార్చకుండా మెదలకుండ వుండ లేము.

షుమారు రెండునెలల వరకు మృత్యుంజయుని అంతే మీా కనుక్కోలేదు. పల్లెటూళ్ళను చూడనివారో, లేక రైలు పెట్టెలోంచి తలకాయ బైటకు పెట్టిచూచిన వారో-ఆశ్చర్యంతో- ఇది ఎలాంటిమాట? తనకిళ్ళార ఇంత దుస్థితిలో వుండ టం చూచివచ్చినా మళ్లా అంతు కనుక్కోపోవటం సంభవ మా - అంటారు. వారికి కెరుకపరచటానికై సంభవమేకాదు. అలానే జరుగుతూ వుంటుంది. - అని చెప్పటం అవసరం. ఎవరికి ఏఆపద వచ్చినా వూరంతా కట్టకట్టి వస్తారన్న వదంతి వుంది. అది - ఏసత్యయుగంలోనైనా వుందో లేదోగాని ఈ కాలంలో ఎక్కడా చూచినట్టు జ్ఞాపకంలేదు. అతని మరణ వార్త రానంతవరకు - బ్రతికున్నట్టే లెక్క. దీనిలో సందేహ మేమీా లేదు.

ఇంతలో ఒక్కసారి చెవులు గింగురుమన్నాయి. మృత్యుంజయుని ఆతోట భాగస్వుడైన పినతండ్రి ; "పోయింది

నాశనమైపోయింది!! వూరంతా నాశనమైపోయింది!! నలుగురి లో ఇక మేస్త్రీనని చెప్పుకుని తలెత్తుకుని తిరగలేను. దిక్కుమాలినవాడు ఒక పాముల వాళ్ళ పిల్లను లేవదీసుకొని ఇంటికి వచ్చాడు కేవలం కన్నెరికమే కాదు-అది లేకపోయినా భగ్గి కానా! దానిచేతి కూడుకూడా తింటున్నాడు! వూళ్ళో దాని కేదైనా శాస్తి చెయ్యకపోతే అంతా అడవిలోకి వెళ్ళివుంటే మంచిది. హరిపుర సంఘం ఈమాట వింటుందా?' అంటూ అల్లరిచేస్తూ తిరుగుతున్నాడు. ఇంకేముంది-చిన్నాపెద్ద అందరి నోటఇదేమాట. ఏమైంది? కలికాలం నిజంగామారిపోతోంది?

"ఇలా జరుగుతుందని నాకు మొదటే తెలుసు. ఎక్కడి నీరు ఎక్కడవచ్చి పడుతుందోనని తమాషాచూస్తూ కూర్చున్నాను. లేకపోతే నాడు పరాయివా డేమన్నానా? పొరుగువాడా? నాఅన్నబిడ్డ ఇంటికి తీసుకురా లేకపోయేవాణ్ణా? డాక్టరు హకీముచేత వైద్యం చేయించే శక్తిలేదా? ఎందుకు మొదలకుండా వూరుకున్నానో ఇప్పుడుచూస్తున్నారుగా! కాని ఇకమాత్రం మెదలకుండా వూరుకోలేను. మేస్త్రీవంశం పేరు మంట కలుస్తూవుంది.- వూరికి అపవాదుక వస్తోంది" అంటూ తిరుగుతున్నాడు పినతండ్రి.

అప్పుడు మాగ్రామవాసుల మంతాకలిసి చేసినపని తలుచుకోగానే ఇవ్వాళ నేను సిగ్గుతో చచ్చిపోతాను. అతని బాబాయి బైలుదేరాడు మేస్త్రీ కులోద్ధారకుడిలాగ - అతని వెంట మేము పది పన్నెండుమందిమి బైలుదేరాము వూరుకి కళంకం రానీకుండా!

మృత్యుంజయుని పూరికొంప దగ్గరకు చేరుకొనేప్పటికి సాయంకాలమైంది. విలాసి పనిపోయిన వసారాలో ఒకమూల కూర్చుని రొట్టెలు తింటూవుంది. అకస్మాత్తుగా ఇంతమంది మనుష్యులు కర్రాబుర్రావేసుకు రావటం చూచి-భయంతో స్తబ్ధురాలై పోయింది.

పినతండ్రి గదిలోకి తొంగి చూచాడు. మృత్యుంజయుడు పడుకొనివున్నాడు. చప్పున తలుపుబైట గొళ్లెం పెట్టి నగంచచ్చిన ఆపిల్లతో మాటలు ప్రారంభించాడు ప్రపంచంలో ఏపిన తండ్రియినా ఏకాలంలోనైనా అన్నకొడుకు భార్యను-ఇలాంటి మాటలు అనివుంటాడని చెప్పటం వ్యర్థం. ఆమె తక్కువ జాతి పిల్లయినప్పటికి ఈ మాటలు సహించ లేక పోయింది. కన్నెర్ర జేసి—' మా బాబు... వారికిచ్చి పెళ్ళి చేశాడు - తెలుసునా?'' అన్నది.

"సరేలగు..." ఇంకేదేదో అనాడు పినతండ్రి. అతనితోపాటు లపది పన్నెండుమంది వీరదర్పంతో గర్జిస్తూ ఒక్కసారిఆమెమీద విరుచుకపడ్డారు. ఒకడుజుట్టుపట్టుకున్నాడు మరొకడు చెవి లంకించుకున్నాడు.

ఇంకొకడు చెయివత్తాడు ఈ నదావకాశం దొరుకని వారుకూడా నిశ్చేష్టులైయుండ లేదు.

సంగ్రామ క్షేత్రంలో మేము భీరులము లాగ మెదలకుండా నుంచుని వుండవచ్చును. మాకు వ్యతిరేకంగా ఇంత దుష్ప్రచారముచేస్తూ తిరగటంలో బహుశా నాశత్రుపక్షంవారి కంటికికూడా సిగ్గుగా కనపడుతూవుంది ఇక్కడ ఒక అప్రసంగిక విషయం చెప్పదలచాను. లండను మొక

నైన మ్లేచ్ఛదేశాలలో పురుషుల మనస్సులలో ఒకటే సంస్కారం అలుముకు పోయింది. స్త్రీలు బలహీనలు, నిరుపాయలు అని వారిమీద చెయ్యెత్తరు. ఇది ఎలాంటిమాట సనాతన హిందూవు ఈసంస్కారానికివప్పుకోడు. వంట్లోనత్తువ లేని వారిమీదకూడా చెయ్యెత్త వచ్చునని మేమంటాం ఆస్త్రీ పురుషు లెవరైనాసరే.

వమచు మొదట కొంచెంసేపు విలపించి తర్వాత మెదలకుండా వూరుకుంది. మేము ఆమెను వూరిబైటకు గెంటి రావటానికి వెళ్ళవప్పుడు వేడుకొంటూ "వక్కొక్కసారి వదిలిపెట్టు బాబా! నేను రొట్టె ఇంట్లోపెట్టి వస్తాను. బైట పిల్లులు కుక్కలు ముట్టుకుంటాయి బలహీనుడు- రోజంతా వస్తుండాలి" అన్నది.

మృత్యుంజయుడు గదిలో పిచ్చివానిలాగ తలమోదుకున్నాడు. తలుపు తిన్నాడు. అనరాని మాట లనేకం అన్నాడు. కాని మేము దానికి కాస్తకూడా చలించలేదు. దేశకళ్యాణంకోసం అంతా సహించి - ఆమెను ఈడ్చుకు పోయాము.

నేనుకూడా వారివెంట వదలకుండా వున్నాను కనుకనే "ఈడ్చుకుపోయాం!" అంటున్నాను. నాలో అలాంటి బలహీనత ఏముందో ఏమో నేను ఆమెమీద చెయ్యెత్తలేకపోయాను. కాని లోపల ఏడవసాగాను. ఆమె అన్యాయం చేసింది. వూరినుండి గెంటించటమే మంచిదనిపించింది. కాని మేము యిద్దైనా మంచిపనిచేస్తున్నా మనిపించలేదు. ఇది నా సంగతి. పోనీ వాటన్నిటినీ-

పల్లెలో దయాదాక్షిణ్యాలు బొత్తిగా శూన్యమనకు. అలా ఎప్పటికీకాదు. పెద్దవాళ్ళమైన తర్వాత మేము చూపించే దయాదాక్షిణ్యాలు చూచి విస్తుపోయారు.

ఈమృత్యుంజయుడే ఆమెచేతికూడుతినకుండా క్షమించరని అపరాధమేమీ చేయకపోతే మాకింత కోపమువచ్చేది కాదు కాయస్థులపిల్లవానితో పాములవాళ్ళపిల్ల వాళ్ళా! ఎంత హాస్యాస్పదమైన విషయం! కూడుతినివాడు తనకాలాన్నే పిలిచి తెచ్చుకుంటున్నాడు. నాడు రెణ్ణెల్లు రోగంతో మంచంపట్టి వుంటే వుండనీ-అందుకని కూడుతింటాడా? పూరీకాదు, పొంగలికాదు, ఏటమాంసంకాదు ? కూడుతినటం అన్నపాపం! నిజంగా అతన్ని క్షమించకూడదు. పల్లెటూరివారు సంకీర్ణ చిత్తులేమీకాదు. నాలుగుకోసులదూరం నడిచి ఆర్జించిన చదువు పొట్టనవున్నవాడే - ఒకనాడు సంఘానికి శిరోభూషణమౌతాడు.

ఇదిగో చూడు! తర్వాతకొంతకాలానికి స్వర్గీయముఖోపాధ్యాయులుగారి విధవకోడలు మానసిక వైరాగ్యంతో నాలుగేళ్ళు కాశీవాసంచేసి - వూరికి తిరిగి వచ్చేప్పటికి సగం ఆస్తి ఈవిధవది, ఆసంపత్తి పరహస్తగతమౌతుందనే భయంతో చిన్నబాబు ఎంతో ప్రయత్నమూ, పరిశ్రమాచేసి వదినను కాశీనుంచి తీసుకువచ్చాడు - అని నలుగురు గుసగుసలాడసాగారు. ఏమైనా చిన్నబాబు స్వభావసిద్ధమైన తనవుదారతతో గ్రామ పంచాయితీ పూజకు రెండువందలు దానంచేసి ఐదూళ్ళ బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలాదులిచ్చి, పండితులకు ఇత్తడి గ్లాసులు, కొయ్యపీటలు ఇచ్చిపంపించేప్పటికే-

నలుప్రైపులనుండి 'ధన్యుడు! ధన్యుడు! అని దుమారం రేగింది. ఇంటికివస్తూవుంటే దారిలో పెద్దమనుషులంతా నెలలతరబడి ఇలాంటిపదనుష్టానాలెందుకుచెయ్యరు? అని దేశకళ్యాణకామన చేయసాగారు.

అలాంటి మహత్తర గాధలు చాలావున్నాయి పోనీ, యుగయుగాలనుంచి సంచితంచేసిన ఇలాంటి గాధలు ప్రతి గ్రామంలోనూ స్థూపాల్లాగ పడివున్నాయి. ఈ దక్షిణ బెంగాల్లో పల్లెలెంట తిరుగుతూ గౌరవించ దగిన ఘటన లనేకం నేను ప్రత్యక్షంగా చూచాను. చరిత్రలో, సంఘంలో, చదువు సంపూర్తయింది. ఇక ఇంగ్లీషులో పట్టిపట్టి బూతులు తిడతూవుంటే చాల దేశోద్ధారకుడవై పోతావు.

మూమూరొక సంవత్సరం గడచిపోయింది. దోమకాట్లు ఇక సహించలేక నేను సన్యాసత్వానికి రాజీనామాయిచ్చి ఇంటికి మరలివచ్చాను. ఒకరోజున రెండు గ్రామములకు మా వూరికి రెండుకోసుల దూరాన వున్నమాలపాండే వెళుతున్నాను తెలవని తలంపుగా తలెత్తిచూచాను. మృత్యుంజయుడు ఒక గుడిశెముందు కూర్చునివున్నాడు. అతని నెత్తిన కాయిరాయి రంగుతలగుడ్డా పెద్దపెద్దగడ్డం, మీసాలు మెడనిండా పూసలు. అతను మృత్యుంజయుడని ఎవరంటారు? కాయస్థుల యువకుడు ఒక్కసంవత్సరంపాటులో తనజాతికీ, కులానికీ తిలాంజలి వదిలి ఒక్కసారి పాములవాడై పోయాడు. మనుష్యుడు తన పదహారు తరాలనుండివున్న జాతిని వదలి మరొకజాతిలో కలవటం ఎంతఆశ్చర్యమైన విషయం! ఒకబ్రాహ్మణ యువకుడు పాకీపిల్లనుపెళ్ళాడి వాళ్లవృత్తి చేస్తున్న విషయం మీకందరికి

తెలిసేవుంటుందనుకుంటాను. ఒకన్న(ద్బ్రాహ్మణపిల్లవాడు మందుల పిల్లను చేసుకొని – మందులవాడవ్వటం చూచాను. ఇప్పు డాతను ఆలిచిప్పలు గెచ్చకాయలు అమ్ముకుంటూ పందులను మేపుకుంటూ తిరుగుతున్నాడు. ఒక మంచి ఘరానా కిటుం బపు కాయస్తుల కుర్రవాడు కసాయిపిల్లను చేసుకొని కసాయి వాడు కావటంకూడా కళ్ళారచూచాను. ఇవ్వాళఅతను తన చేతులతో పశువులను కోసి అమ్ముతున్నాడు. అతన్నిచూచి ఒకప్పుడు అతను కసాయివాడు కావని ఎవరన గలరు! కాని వీటన్నిటికీ ఒకటే కారణం. ఈవిధంగా ఇంత తేలిగ్గా పురుషు లను కిందకు దింపుకు వచ్చినవారు - అదేవిధంగా వారికి వూతం యిచ్చి పైకి తీసుకురాలేరా అని నేను తరుచు ఆలో చిస్తూవుంటాను. నేను ఇవ్వాళ గ్రామపెద్దల గౌరవం కాపాట్టానికి పెత్తందారునైపోయాను. ఆ గౌరవం వారొ క్కరికే దక్కనీయాలా? తమ వల్లే వారింత తొందరగా కిం దకు దిగజారిపోయారు. లోపలినుండి వారికేమాత్రమూ కూడా వుత్సాహంగానీ, సహాయంగానీ దొరకదు.

సరే, పోనీ. ఆవేశంలో అధికారచర్చ జరిపానేమో! దేశంలో నూటికి తొంభై మంది పురుషులు పల్లెల్లో వుండే పెద్దమనుషులయ్యారు. అందుచేతే – పల్లెలకోసం ఏదైనా చెయ్యాలన్న విషయాన్ని నేనెంత ప్రయత్నించినా మరచి పోలేను. చూచి-ఇతనే మృత్యుంజయుడని ఎవరనగలరు? నన్ను అతను ఆదరించి కూర్చోబెట్టాడు విలాసి చెరువునీళ్లు తీసుకురావటానికి వెళ్ళింది. నన్ను చూడగానే ఆమె ఎంతో వుప్పొంగిపోయి "మీరవ్వాళ కాపాడకపోతే నన్ను చంపేశే

వాళ్ళు. నాకోసరం నువ్వు ఎన్ని దెబ్బలు తిన్నావో!'' అని మాటమాటకు అనసాగింది.

వారి మాటలనుబట్టి-ఆమరునాడే ఇక్కడికి లేచివచ్చి గుడిశవేసుకొని సుఖంగా వుంటున్నారని విన్నాను. సుఖంగా వున్నారని వేరేచెప్పవసరము లేదు. వారి మొహంకేసి చూడ గానే గ్రహించాను.

వాళ్ళు అవ్వాళ ఎక్కడికో పామును పట్టుకోటానికి వెళ్ళాలట. బయానాకూడా తీసుకున్నారు. వారు వప్పుకుంటే వెంట నేనుకూడా వెళ్ళటానికి కుతూహలపడ్డాను. నల్లత్రాచు కొని దాన్ని పెంచాలనీ, పాముమంత్రం నేర్చుకోవాలనీ నాకు చిన్నప్పటినుంచీ అభిలాష వుండేది.

మంత్రం నేర్చుకునే అవకాశం ఎంత ప్రయత్నించినా దొరుకలేదు. మృత్యుంజయుని గురువుని చేసుకోవచ్చునని ఆశతో ఆనందంతో వుప్పొంగిపోయాను. అతను-వాడి మామకు శిష్యుడు. నా అదృష్టం ఒక్కసారి ఇట్లా చమక్క మంటుందని ఎవరూహించగలరు?

కాని పని చాలకష్టం - ప్రమాదకరమైనది కూడాను. అందుచేత మొదటవారు అడ్డుపెట్టారు. కాని నేను పట్టుపట్టి కూర్చున్నాను. చివరికి అతను నన్ను శిష్యునిగా చేసుకోక తప్పలేదు. మృత్యుంజయుడు నాకు పాముని పట్టుకునేమంత్రం పద్ధతినేర్పి-ముంజేతికి ఒక తాయెత్తుకట్టి పాములవాణ్ని చేశాడు.

మంత్రం ఏమిటో తెలుసా? చివరకొంత నాకు జ్ఞాపక ముంది—

'ఛీ- రే- కేవ్రుటు-నువ్వు మనసాకి వాహానము ... తల్లి ...

తిరిగి-మరిగి-పాతాళం బద్దలుచెయ్యి-ఢోండావిషంనువ్వు తీసుకో—

నీ విషం-ఢోండాకుయివ్వు-క్షీరరాజా-మణిరాజా!

ఎవరి ఆజ్ఞతో-విషహారుని ఆజ్ఞతో!

దీని అర్థం ఏమిటో నాకు తెలియదు, కారణం ఈ మంత్రి సృష్టలు ఎవరో రుషిపుంగవులై వుంటారు-వారిదర్శనం ఎప్పుడూ కలిగివుండదు.

చివరికి ఒకరోజున ఈమంత్రం యొక్క సత్యాసత్య మీమాంస జరిగింది పామును పట్టుకోవటంలో నలువైపుల నేను ప్రసిద్ధిజెందాను. ఆ. నౌడా మంచి సరుకుగలవాడు సన్యాసావస్తలో కామాఖ్యవెళ్ళ నేర్చుకొని వచ్చాడు, అని అందరూ అనసాగారు. ఇంత తక్కువ వయసులో - ఇంత ప్రవీణుడనయ్యేప్పటికి నాకు కాలు కింద నిలవలేదు.

ఇద్దరు మనుష్యులు మాత్రం ఇది నమ్మలేదు-మాగురువుకూడా మంచీ-చెడ్డా ఏమీ అనేవాడుగాదు, కానివిలాసి అప్పుడప్పుడూ చిరునవ్వుతో "ఇవి చాల భయంకరమైన జంతువులు - కొంచెం జాగ్రత్తగా-వుండుబాబూ!" అనేది. నిజంగా కోరలు పీకిన పాము విషం పిండటం మొదలైన పనులు నేనెంత నిర్లక్ష్యంతో చేసేవాణ్ణో - ఇప్పుడది తలుపుకు రాగానే వళ్ళంతా కంపించి పోతుంది.

అసలు సంగతేమి టంటే పామును పట్టుకోవటం కష్టమేమీకాదు. పట్టుకున్నపామును రెండు మూడు రోజులు కుండలో మూతపెట్టి వుంచి తర్వాత - దాని విషపు కోరలు

పీకినా పీకకపోయినా – అసలు కరవనే కరవదు. పడగ విప్పి కాటువేయబోయినట్టు భయపెడుతుంది, గాని కరవదు.

అప్పుడప్పుడు మేము గురు శిష్యుల మిద్దరమూ వాదించుకుంటూ వుండేవాళ్ళము. పాములవాళ్ళకు లాభసాటియైన వృత్తి చట్కాలు అమ్మటం. వాటిని చూడగానే పాములు పారిపోతాయి! అంతకు ముందు ఒక తతంగం చేయవలసి వస్తుంది. చట్కా చూపించగానే పారి పోయేట్టు చేయవలసిన పాముకు-ఇనపమేకొకటి ఎర్రగా కాల్చి - రెండుమూడుసార్లు దానిమూతిమీద అంటించాలి. తర్వాత - దానికి చట్కా చూపించు - ఇంకేదైనా చూపించు – దానికేసి తిరిగేచూడదు – ప్రాణాలొడ్డి పారిపోవటానికి ప్రయత్నిస్తుంది. విలాసినికి ఇది యిష్టము వుండేదికాదు. మృత్యుంజయునితో మానవుణ్ణి ఈవిధంగా మోసగించ కూడదు అంటూవుండేది.

'అంతా ఇల్లాగేచేస్తారు దీనిలోతప్పేముంది? అనేవాడు మృత్యుంజయుడు.

"చెయ్యనీ అందర్నీ! మనకిండి-తిప్పలకేమీ చింత లేదు. ఇంకా అనవసరంగా లోకులను మోసగించటమెందుకు" అనేది విలాసి.

మరొక విషయం నేను తరచుగా చూస్తూ వచ్చాను. పాములను పట్టుకోవటానికి బేరాలు రాగానే విలాసి - వాటిని చెడగొట్టటానికి రకరకాలైన విఘ్నాలు కలిగిస్తూ వుండేది. ఇవ్వాళశనివారం - మంగళవారము... ఇంకేవేవో వంకలు పెట్టేది. మృత్యుంజయుడు ఇంటివద్ద లేకపోతే - వీలు కాదని బేరాలను తిరగ్గొట్టివేస్తూ వుండేది, కాని అతనువుంటే

మాత్రం వదలిపెట్టేవాడుకాదు. అతనికి డబ్బుయందుఅపేక్ష కలిగేది. నాకుమాత్రం ఒకవిధంగా మైకంలాగ కమ్మిపోయేది. వినోదం మినహా - దానిలోభయం కూడా వున్న దన్నవిష యంనామనసుకి ఎప్పుడూ తట్టనేలేదు. కాని ఆపాపానికి ప్రాయశ్చిత్తం నేనొకరోజున అనుభవించాల్సివచ్చింది.

ఆరోజున - అక్కడికి కోసెడు దూరానవున్న ఒకగొల్ల వాని ఇంట పామును పట్టటానికి వెళ్ళాను. విలాసి ఎప్పుడూ వుంటూవుండేది. ఇవ్వాళ కూడావుంది. మట్టి గుట్ట తవ్వగా తవ్వగా - లోపల ఒకకన్నం ఆసోకిదొరికింది. మేము ఎవ రమూ చూడలేదు. కాని విలాసిపాములవాళ్ళ పిల్ల ఆమెవంగి కొన్నికాగితపు పీలికలు తీసి, కొంచెము జాగరత బాబూ! పాముఒకటికాదు. జోడు. బహుశా ఇంకా కూడా వున్నయేమో !'' అన్నది.

''పిల్లు ఒక్కటేవచ్చి దూరింది ఒక్కటే కనపడింది అంటున్నారు'' అన్నాడు మృత్యుంజయుడు.

విలాసి కాగిత ప్పీలికలు చూపిస్తూ ''చూడలేదు అవి ఇక్కడవుండటానికి స్థావర మేర్పరచుకున్నాయి.'' అన్నది.

''కాగితాలు కూడా తీసుకువస్తాయి''అన్నాడుమృత్యుం జయుడు.

''ఇద్దరిమాటలు నిజమే. నేనుచెబుతున్నానుకాని రెండు తప్పకుండా వున్నాయి'' అన్నది విలాసి.

వాస్తవంగా విలాసి మాటలే నిజమైనాయి. పదినిమి షాలలో మృత్యుంజయుడు ఒకకోడెత్రాచును పట్టుకొని నా చేతికిచ్చాడు. నేనుదాన్ని బుట్టలో పెట్టిమూతవేసి వస్తూం

డేప్పటికి మృత్యుంజయుడు 'అబ్బా'' అని ఒకనిట్టూర్పువిడిచి బైటికివచ్చి నుంచున్నాడు. అతని చేతిలోంచి జలజలరక్తం కారుతూవుంది.

అంతా కింకర్తవ్య విమూఢులమై నుంచున్నాము, పామును పట్టుకోబోతే - అదిపారిపోకుండా కన్నంలోంచి తలబైటికిపెట్టి కాటువేసిన కల్పనాతీతమైన ఘటనను నా జీవితంలో ఇదే మొదటిసారిగా చూచాను. విలాసి అరుస్తూపరుగెత్తుకు వచ్చితన పయట చెంగు చించిగాయంపైన బాగా బిగించి కట్టింది. తర్వాత - వెంటతీసుకొచ్చిన మందుల నన్నిటినీ అరగదీసిపోసింది. మృత్యుంజయుడికి ఒకతాయిత్తువుండనే వున్నది. నాతాయిత్తు కూడాతీసి అతని చేతికికట్టాను. ఇక అతనికి విషం ఎక్కదనిఆశ. నేనునా ఆ విషహారుని-ఆజ్ఞ — మంత్రం ఎడతెగకుండా బిగ్గరగా వల్లించసాగాను. చుట్టూ జనం పోగయ్యారు చుట్టుపట్ల వైద్యులనందరినీ పిలుచుకు వచ్చారు. విలాసి తండ్రికి కూడా కబురంపించాను,

నేను ఆగకుండా అవిరమ గతిలో మంత్రం చదువుతున్నాను. కాని దానివల్ల ఏమీ విషం దిగినట్టు తోచలేదు. అయినా మంత్రపఠనం మాత్రం వదిలిపెట్టలేదు. మరిపదిపదిహేను నిమిషాలన్న తర్వాత మృత్యుంజయునికి వమనం వచ్చింది. ముక్కుల్లో మాట్లాడటం మొదలు పెట్టాడు. అప్పుడు విలాసి తెలివితప్పి కిందపడి పోయింది. నావిషహారీ మంత్రం వల్ల లాభం లేదని నేనప్పుడు గ్రహించాను.

చుట్టుపట్లపేరు బొందిన మరి ఇద్దరు ముగ్గురు మంత్రగాళ్లు కూడా వచ్చారు. విడివిడిగానైతే నేమి-అంతా కలిస్తే

నేమి - ముప్పయి మూడుకోట్ల దేవతల్ని తలుచుకోసా గాము. కాని విషం మాత్రం మా ఎవరిప్రార్థన వినలేదు. రోగికి క్రమక్రమంగా దుస్థితిరాసాగింది. అమంత్రకారులు ముగ్గురూకలిసి తిట్టినతిట్లు_నిజంగా ఆవిషానికి చెవులే వుంటే- మృత్యుంజయుని వదిలిపెట్టేమిటి- ఈదేశాన్నే విడిచిపోయేవి. కాని ఎవరివల్లా ఏమీకాలేదు. మరి ఇరవై నిమిషాలతర్వాత రోగి_తలిదండ్రులు పెట్టిన మృత్యుంజయుని పేరూ, మామ పెట్టిన - మంత్రౌషధి మహిమా మిథ్యచేసి ఇహలోక యాత్ర చాలించాడు. విలాసి భర్త శిరసు వళ్ళోపెట్టుకుని- శిలలాగ కూర్చునివుండిపోయింది.

పోనీ, ఆ దుఃఖగాథను ఇక పెంచదలచుకోలేదు. ఆమె ఇక ఏడురోజులకంటె ఎక్కువ జీవించివుండదలచలేదు. ఒక రోజున నాతో "నామీదవట్టు బాబూ! ఈపని నువ్వెం కెప్పుడూ చెయ్యకు" అన్నది.

నాతాయిత్తు వగైరాలన్నీ మృత్యుంజయునితోపాటే దహనమైపోయాయి. విషహరి ఆజ్ఞ మంత్రంమాత్రం మిగిలి వుంది. కాని ఆ ఆజ్ఞ మేజస్ట్రేటు ఆజ్ఞేమీకాదు. పామువిషము భారతీయుల విషమూకాదు.

ఒకరోజున విన్నాను-ఇంట్లో విషానికి కొరతలేదు. విలాసిని ఆత్మహత్యచేసుకుంది. శాస్త్రానుసారంగా ఆమె నరకానికి పోయింది. ఆమె ఎక్కడికెళ్ళినా-నేను వెళ్ళేసమయం వచ్చినప్పుడుమాత్రం-ఏ నరకానికి వెళ్ళాలన్నా వెనకాడను.

పినతండ్రి పదహారణాల తోట ఆక్రమించుకు కూర్చున్నాడు. ఎంతో విజ్ఞునిలాగ- అపఘాత మృత్యువు అతనికే

కాకపోతే ఇంకెవరికి? మగవాడు ఒకటిగాదు—వంద చేసినా అయ్యేదా చెడిపోయేదా ఏమీ లేదు. మహా అయి తే నింద జరుగుతుంది కాని దాని చేతికూడు తిని మృత్యువుని పిలిచిందెందుకు? వాడు చచ్చింది కాకుండా నాకు కూడా తలవంపు తెచ్చాడు .ఎవరూ తలకొరివి పెట్టేవారు లేరు. పిం డంవేసేవారూ లేరు. శ్రాద్ధశాంతు లేమీ జరగనూ లేదు.

వృద్ధులో వారంతా ఏకస్వరంతో "దీనిలోసం దేహమేముంది! అన్నపాపం దీసికేదైనా ప్రాయశ్చిత్తముందా?" అనసాగారు.

విలాసి ఆత్మహత్యా ఘటన చాలమందికి పరిహాస విషయమై పోయింది. ఈతప్పు బహుశా ఇద్దరిదీ నేమో! కాని మృత్యుంజయుడు పల్లెటూరి అన్నపానాదులతోనే ఇంత పెద్ద వాడయ్యాడు. అతన్నింత దుస్సాహసకార్యానికి పురికొల్పిన వస్తువు కేసి ఎవరూకన్నెత్తికూడా చూడలేదు.

స్త్రీ పురుషులు అన్యోన్యంగా ప్రేమించి వివాహం చేసుకొనే ఆచారం లేకపోవడమే కాక పైగా నిందనీయవస్తువు కావడం, ఆశించటానికి సౌభాగ్యం, ఆకాంక్షించటానికి ఆనందం–నిరంతరం వంచితం కావటం, విజయగర్వం పరా జయవ్యథావీటిలో దేనినీకూడా తన జీవితంలో అనుభవించ వలసినఅవసరం కలక్క–పోవటం, తప్పుచేస్తే దుఃఖంచేయక పోతే ఆత్మప్రసాదం–రెంటిలో ఏఒకటి కూడా లోపించటం బహు దర్శి పండిత సమాజం—దేశవాసులకు స్వేచ్ఛ లేకుండాచేసి జీవిత పర్యంతం – మొండివాడై వుండేట్లు ఏర్పాటుచేయటం ఇందువల్లే మనదేశవాసులకు - వివాహ సంస్కారం ఒక కంటాక్ట్టైఉందని నాకు అనిపిస్తూవుంది. అది ఎంత వైదిక

మంత్రాల డాక్యుమెంట్లతో ముడిపెట్టినా - మనదేశవాసులకు మృత్యుంజయుని అన్న-పాపకారణం తెలుసుకునే సామర్థ్యం లేదు. విలాసినిని పరిహసించిన సాధుసన్యాసులకు గృహిణులకు అందరికీ అక్షయసతీ లోకంప్రాప్తమౌతుందని కూడా నాకు తెలుసు.కాని ఆపాముల పిల్ల మంచంమీద పడి వున్న రోగి హృదయాన్ని క్రమక్రమంగా జయించింది. అప్పటి ఆమె గౌరవపు అణుమాత్రంకూడా నేటివరకు వారిలోఎవరైనా చూచారో లేదో. మృత్యుంజయుడుబహుశాతుచ్ఛుడే కావచ్చు కాని అతని హృదయాన్ని జయించిదాని నాక్రమించుకొనే ఆనందం తుచ్ఛముకాదు, ఆసంపదసామాన్యమైనదీ కాదు.

ఈ దేశవాసులు ఈసంగతి తెలుసుకోవటమే కష్టం. నేను భూదేవముఖర్జీ కుటుంబనిబంధనలను గూడా తప్పనను శాస్త్రాలను, సంఘవిధులనుగూడా నిందించను. నిందిస్తే - ఈ హిందూసంఘం తన నీతినియమాల బలంవల్లే ఇన్ని విద్రోహాలనుగూడా తట్టుకొని ఇన్ని యుగాలు జీవించియుంది. నేను వాటినిగూడా అత్యంత శ్రద్ధతోచూస్తాను. అని సమాధానం వస్తుంది. ప్రతిసమాధానంగా నేను వారితో జీవించి వుండటమే పరమలక్ష్యం. అలా మహాకాయమైన ఐరావతము గూడా లుప్తించిపోయింది. నూవు మొక్క బ్రతికివుంది. పెద్దింటి నందగోపాలునిలాగ ఎప్పుడూ వీళ్ళుముందే వీళ్ళనే వుంచుకుంటే మంచిదే. దానిలో సందేహమేమీ లేదు. కాని నూవు మొక్కలాగ బ్రతికివుండకేకంటే అతనిని ఒకసారి గుడినుండి కిందకుదింపి నడవనిస్తే ప్రాయశ్చిత్తము చేసుకోవలసిన పాపమేమీ కలుగదు, అని అంటాను.

# హరిచరణ్

ఆ సంగతి జరిగి చాల కాలమైంది. షుమారు పదినంవత్సరముల నాటిమాట. అప్పటి కింకా దుర్గాదాసుబాబు వకీలు కాలేదు. దుర్గాదాస్ శర్మను బహుశా నువ్వెరుగుండివుండవు. కాని నేను బాగా ఎరుగున్నాను. పద! అతనితో నీకు పరిచయం చేస్తాను.

తల్లిదండ్రులు లేని అనాథ కాయస్థబాలకు డొకడు ఎక్కడనుంచి వచ్చి రామదాస్‌బాబు గారింటివద్ద వుండసాగాడో తెలియదు. పిల్లవాడు మంచివాడని అందరు అంటూ వుండేవారు. అందమైన వాడు, తెలివైనవాడు-దుర్గాదాసు బాబుకు ప్రియమైన నౌకరూను.

చిన్నపెద్ద పనులన్నీ అతనే చేయటానికి సిద్ధమౌతాడు అవుకు కుడితి పెట్టటం దగ్గరనుంచీ రామదాస్‌బాబు కాళ్ళు వత్తటం వరకు పను లన్నీ అతను అతిశ్రద్ధతో చేస్తూ వుండేవాడు. ఎప్పుడు ఏదో ఒక పనిలో నిమగ్నమై వుంటాడు. అదే అతనికి నచ్చుతుంది.

పిల్లవాని పేరు హరిచరణ్. అతనిపని చూచి యజమానురాలికి ఆశ్చర్యంవేసేది. అప్పుడప్పుడు ఆమె అతన్ని కోప్పడుతూ "ఇంకా నౌకర్లున్నారుగా హరీ! వారుచేస్తారుగా నువ్వు పిల్లవాడివి, ఇంత పరిశ్రమచేయటం ఎందుకు?" అనేది. హరిలో ఒక అవగుణం కూడావుంది. అతను తరచుగా నవ్వుతూ వుండేవాడు. నవ్వుతూ "మేము బీద వాళ్ళముతల్లీ! పనిపాటలు చేయక ఇంకేంచేస్తాం?" అనేవాడు.

ఈ విధంగా సుఖదుఃఖాలు, ప్రేమ ఆదరాలు, వని పాటలతో హారిచరణ్ షుమారు ఒక సంవత్సర గడిపాడు.

* * *

సురబాల రామదాసుబాబుకి చిన్నకూతురు. ఆ మెకు షుమారు అయిదా రేళ్లవయస్సు వుంటుంది. హారిచరణ్ తో సురబాల బాగా కలిసిపోయింది. ఇద్దరిలో బాగా పొనగుతుంది. పాలు త్రాగించటానికి తల్లి బిడ్డల మధ్య ద్వంద్వయుద్ధం జరిగి ఎంత చెప్పినా ఆ చిన్నపిల్ల పాలు తాగనప్పుడు - త్రాగకపోతే ఆయుస్సు తగ్గుతుందనే వ్యాకులంతో మండిపడి తిల్లబుగ్గలు సాగదీసినా లాభం లేని పరిస్థితిలో హారిచరణ్ చెప్పగానే త్రాగేది.

చాలా సంగతులు జరిగినాయి. కాని ఇప్పుడవి అనవసరం. హారిచరణ్ ని సురబాల బాగా ప్రేమిస్తూ వుందని మాత్రం తెలుసుకో.

దుర్గాదాసుబాబు ఇరవైయేళ్ళ వయసులో వున్నప్పటి సంగతి చెబుతున్నాను. దుర్గాదాసు అప్పుడు కలకత్తాలోనే చదువుతూ వుండేవాడు. ఇంటికి రావటం అతనికి మహా యాతన - మొదట స్టీమరుమీద ఎక్కటం, తర్వాత పది క్రోసుల దూరం కాలినడకను నడవటం - చాలా విసుగైన ప్రయాణం!

కొడుకు బి. ఏ. ప్యాసయి వస్తున్నాడని తల్లి చాల హడావుడిగావుంది కొడుకు తిండితిప్పలు సరిగా వుండటానికీ, సేవా శుశ్రూషలు చేయటానికిఇం టిల్లపాదీచాలాఆతురతతో వున్నారు.

"ఈకుర్రివా డెవరమ్మా? "దుర్గాదాసు అడిగాడు." ఒక కాయస్థుల పిల్లవాడు. తలిదండ్రులెవరూ లేరు. అందుకని మీనాన్న దగ్గరకుతీశాడు. పనిపాటలన్నీ చేస్తాడు. చాలబుద్ధిమంతుడు. ఎవ రేమన్నా కోపంలేదు. పాపం తల్లిదండ్రులెవరూ లేరు. ఇంకా చిన్నతనం, నాకు అతనియందు చాల ప్రేమ!" అన్నది తల్లి.

ఇంటికి వచ్చిన తర్వాత దుర్గాదాసుబాబుకి హారిచరణ్‌తో ఇదే మొట్టమొదటి పరిచయం.

సరే, ఇప్పుడు హారిచరణ్‌కి చాలా పనులు చేయవలసి వస్తోంది. దీనివల్ల అతనికి సంతోషమే గాని కోపంలేదు. దుర్గాదాసుకి స్నానానికి నీళ్ళుతోడటం, అవసరమైనప్పుడు మంచినీళ్ళు తెచ్చిపెట్టటం, సమయానికి ఆకు వక్కలు అందించటం సిగరెట్లు యివ్వటం – ఈ పనులలో హారిచరణుడు చాల తెలివైనవాడు. దుర్గాదాసుబాబు కూడా తరచు కుర్రవాడు చాల ఇంటిల్‌జెంటు అనుకుంటూ వుండేవాడు. గుడ్డలు వుతకటం, మంచినీళ్ళు తీసుకురావటం, బూట్లు పాలిష్ చేయటం మొదలైన పనులు అతను చేస్తేగాని దుర్గాదాసుకి నచ్చేవికావు.

*  *  *

ఎక్కడ నీరు ఎక్కడికి వెళ్ళి ఆగుతుందో తెలియదు. జ్ఞాపకముందా? ఒకసారి మన మిద్దరము ఏడుస్తూఏడుస్తూ ఒక దురూహ్యమైన తత్వం చదివాము. అన్నివిషయాలలోనూ అది సరిపోతుందనిపిస్తూవుంది. ప్రపంచంలో మంచికి మంచిజరుగుతుందా? మంచికిచెడు జరగటం లేదూ? నువ్వు చూడకపోతే రా! చూపిస్తాను. అది మహాదురూహ్య తత్వం.

పైరాసిన సంగతులన్నీ అర్థం చేసుకోవా లని నేననను. అవసరం కూడా లేదు. నీకు ఫిలాసఫీ వుపదేశించుదా మని కూడా కాదు నావుద్దేశం. అయినా మనలో మనకు రెండు మాటలు చెప్పినా ఇబ్బంది లేదు.

ఇవాళ దుర్గాదాసుబాబు ఏదో పెద్దవిందుకు వెళ్ళాలి ఇంటివద్ద భోజనం చెయ్యడు. తిరిగివచ్చేప్పటికి కూడా చాలా పొద్దుపోతుంది. అందుచేత పని పాటలన్నీ అయిన తర్వాత పండుకో మని చెప్పిపోయాడు.

ఇక హరిచరణ్ సంగతి చెబుతాను. దుర్గాదానుబాబు రాత్రిపూట బైటగదిలోనే పండుకుంటూ వుంటాడు. దానికి కారణం అందరికీ తెలియదు. భార్య కన్నవారింటికి వెళ్ళి పోయిన తర్వాత బైట పండుకోటమే అతనికి నచ్చిం దని నావుద్దేశం.

రాత్రిపూట చిన్నబాబు (దుర్గాదాస్)కు ప్రక్క వెయ్య టం. పండుకున్న తర్వాత అతని కాళ్ళు వత్తటం మొదలైన పనులన్నీ హరిచరణ్ బాధ్యతలో వున్నాయి. అతను బాగా నిద్రపోయిన తర్వాత హరిచరణ్ ఎదురుగావున్న కొట్లోకివెళ్లి పండుకునేవాడు.

హరిచరణ్‌కి సాయంత్రమే తలనొప్పి ప్రారంభించింది జ్వరం వస్తుందని అతను గ్రహించాడు. మధ్య మధ్య అప్పు డప్పుడూ అతనికి జ్వరం వస్తూవుండేది. అందుచేత అతనికిదాని పూర్వలక్షణాలతో బాగా పరిచయం వుంది. హరిచరణ్ కూర్చోలేక పోయేప్పటికి వెళ్ళి పండుకున్నాడు. చిన్నబాబు గారికి ఇంకా పక్క వేయవలసి వుందని అతనికి జ్ఞాపకమే లేదు.

రాత్రి అంతా భోజనానికి వచ్చారు. కాని హరిచరణ్ రాక పోవటంచూచి అతని అమ్మగారు చూట్టానికి వచ్చింది. వంటి మీద చెయ్యివేసి చూచింది. చాల వేడిగా వుంది. జ్వరం వచ్చిం దని తెలుసుకొని ఇంకెక్కువ బాధించకుండానే వెళ్ళి పోయినది.

రాత్రి షుమారు పన్నెండు ఒంటిగంట అవుతుంది. విందు ఆరగించి చిన్నబాబు ఇంటికి వచ్చిచూచాడు. పక్క లేదు. ఒకవైపున నిద్ర పడదోసుకు వస్తూ వుంది. ఇంటి కెళ్ళి మత్తుగా పండుకుందాం-హరిచరణుకు బూట్లుతీసిఅలసి వచ్చిన పాదాలను మెల్లగా వత్తుతూ వుంటాడు. తృప్తిగా నిద్రపోయి తెల్లవారి కన్ను తెరుద్దా మని దారిపొడుగునా ఆలోచించు కున్నాడు.

ఒక్కసారి నిరాశజెంది చాల మండిపడ్డాడు. కోపం తోనే "హరీ! ఓహరీ!" అని రెండుమూడుసార్లు పిలిచాడు. హరి వుంటేగా పలకటానికి. పాపం జ్వరంతో స్పృహ లేకుండా పడివున్నాడు. గదిలోకి వెళ్ళి చూచాడు - నిజంగా కప్పుకొని పడుకొని వున్నాడు.

ఇక సహించ లేకపోయాడు. జుట్టు గట్టిగా పట్టుకొని కూర్చోబెట్టటానికి ప్రయత్నించాడు. కాని అతను అలాగే పడివున్నాడు ఇక బాబు క్రోధావేశంతో విచక్షణాజ్ఞాన శూన్యుడై హరిచరణ్ వీపుమీద బూటుకాలితో రెండు తన్నులు తన్నాడు. ఆ తన్నులకు అతను లేచి కూర్చున్నాడు.

"దుర్గాదాసుబాబు! చిన్నపిల్లవాడిలాగ పడి నిద్రపోతున్నాను: పక్క నేను వేయనా?" అంటూ వుండగానే అతని క్రోధం పెరిగిపోయి రెండుమూడు బెత్తపు దెబ్బలు వేశాడు.

రాత్రి హరిచరణుడు పాదాలొత్తుతున్నప్పుడు మాత్రం వేడినీటి చుక్కలు అతని కాళ్ళమీద పడినాయి.

*　　　*　　　*

రాత్రంతా దుర్గాదాసుబాబుకు నిద్రరాలేదు. ఆ నీటి బిందువులు అతనికి చాల వేడిగా తగిలినాయి. హరిచరణుని అతను చాల ప్రేమిస్తూవుండేవాడు,అతని వినయంమూలంగా అతనేకాదు, అందరికి ప్రేమపాత్రుడయ్యాడు. విశేషంగా ఈనెలగోజుల పరిచయాన్ని బట్టిఅతనికిమరింత ప్రేమపాత్రుడై పోయాడు.

రాత్రి అతను ఒకసారి చూచి వద్దాం, ఎక్కడ తగిలినాయో, ఏమో? అనుకున్నాడు. కాని నౌకరుగా! అతను వెళ్ళటం బాగుంటుందా? వెళ్ళి జ్వర మేమైనా తగ్గిందా అని అడుగుదా మని అనేకసార్లు అనుకున్నాడు. కాని అతనివద్ద కెళ్ళటానికి సిగ్గుగా తోచింది. పొద్దున్నే హరిచరణ్ బాబు గారు మొహం కడుక్కోటానికి నీళ్ళు తెచ్చి యిచ్చాడు.దుర్గాదాసుబాబు అప్పుడైనా అడిగితే, ఒకటి రెండు ఓదార్పుమాటలంటేం?వాడింకా కుర్రవాడు. వాడివయస్సెంత వుంటుంది-పదమూడేళ్లు కూడా వెళ్ళలేదు. పిల్లవాడనుకునే – ఒకసారి దగ్గరకు పిలచి-దెబ్బలు ఎక్కడ తగిలినాయో-వాతలుఎక్కడ తేలినాయో-బూటుదెబ్బ తగిలిందో చూస్తేం? కుర్రవాడేగా! ఇంత సిగ్గుపడవలసిన అవసర మే మొచ్చింది?

షుమారు తొమ్మిది గంటలకు ఎక్కడనుంచో తంతి వచ్చింది. తంతి సంగతి అనగానే దుర్గాదాసు బాబు హృదయ తంత్రులు ఆగిపోయినాయి. కొంచెం గాబరాపడ్డాడు. చించి చూచాడు. భార్యకు చాల జబ్బుగా వుంది. ఒక్కసారిగా అతని గుండె దడదడలాడింది. ఆరోజునే అతను కలకత్తా వెళ్ళ వలసివచ్చింది. బండి ఎక్కినతర్వాత-ప్రాయశ్చిత్తం చేయటం లేదుగదా భగవంతుడా! అనుకోసాగాడు.

షుమారు ఒక నెల గడచిపోయింది. దుర్గాదాసు మొహం చాల సంతోషంగా వుంది. అతని భార్యకు ఒక కొత్తజన్మ వచ్చిందే అనుకో-చావునుండి బ్రతికింది. ఇవ్వాళ పథ్యం తీసుకుంది.

ఇంటిదగ్గరనుండి ఇవ్వాళ ఒక వుత్తరం వచ్చింది. దుర్గాదాసు బాబు తమ్ముడు రాశాడు. దానికింద 'మరియు' అని-చాల దుఃఖకరమైన విషయం. నిన్న వుదయం పది రోజులు జ్వరంలో వుండి హరిచరణుడు చనిపోయాడు. చని పోయేముందు అనేకసార్లు మిమ్మల్ని చూడాలని కలవరిం చాడు అని వ్రాశాడు.

పాపం తలిదండ్రులు లేని అనాథ బాలుడు.

దుర్గాదాసుబాబు వుత్తరం ముక్కలు ముక్కలుచేసి పారేశాడు.

72



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B156 |
| పుస్తకం పేరు | శరత్ కథలు 03 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1 TO 64 |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Hasrama |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | Good |